# సినిమా విశేషాలు

### ఊర్వశికి అర్హురాలు!

మన శారదకు కేంద్ర ప్రభుత్వం రెండుసార్లు "ఊర్వశి" ఇచ్చి గౌరవించింది. అర్హతలేని మనిషికి, ఎవరూ యోగ్యతా పత్రాన్ని యివ్వరు. శారద అట్టి అత్యుత్తమ బిరుదానికి అర్హురాలు గాబట్టే యివ్వడం జరిగింది. అదే పట్టం మూడవసారి కూడా శారదకు యివ్వాల్సి వస్తుందేమో!

అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైజస్ వారి "ఊర్వశి" వర్ణ చిత్రాన్ని చూసిన తరువాత, శారద ఎంత గొప్ప నటో తెలుసుకొన్నాను. ఇకపై నటించడానికి మిగులులేకుండా 'ఊర్వశి' చిత్రంలో అద్భుతంగా నటించింది. రెండు పాత్రలను పోషించింది. ముఖ్యంగా నల్లమ్మాయి వేషంలో శారద అద్వితీయంగా, అసాధారణంగా, అసమానంగా నటించింది. శారద నట జీవితంలో యింత మంచి పాత్ర ముందెన్నడూ రాలేదు ... మున్ముందు రాదు అన్నది నా నిశ్చితాభిప్రాయం. భరత్ సంజీవ్ కుమార్ తను ధరించిన పాత్రకు కరెక్ట్ అనిపించాడు.

సాంకేతికంగా చెప్పదలిస్తే, దర్శకుడు బాపయ్యకు మొదటి గ్రేడు, ఛాయాగ్రాహకుడు భాస్కరరావుకు రెండవ గ్రేడు, సంగీత దర్శకుడు చక్రవర్తికి తరువాతి గ్రేడు యివ్వవలసి వస్తుంది. నిర్మాత పి. రాఘవరావుకు "ఊర్వశి" పేరు, దాంతోబాటు డబ్బును గడించిపెడుతుంది.

### సూర్యకాంతి

సహితా ఫిలిం ఎంటర్‌ప్రైజస్ నిర్మిస్తున్న చిత్రానికి యిడిన పేరు "సూర్యకాంతి." ఈ చిత్రానికి బి. ఏ. సుబ్బారావు దర్శకుడు. అందుకనే చిత్రం ఆసక్తిని కలిగిస్తుందని రాయగలుగుతున్నాను. ఇందులో జమునకు విచిత్రమైన పాత్ర లభించింది. చాలా చక్కగా చేసింది.

"సూర్యకాంతి" చిత్రానికి ఎస్. ఆర్. నంది రచనను, హనుమంతరావు సంగీతాన్ని, శ్రీకాంత్ కెమెరాను, చలం కళను, వెంకటేశ్వరరావు-కౌండిన్య సహ దర్శకత్వాన్ని నిర్వహించారు. కె. రామరత్నం ప్రొడక్షన్ కంట్రోలర్.

తమిళ నటి మనోరమ యిందులో గమ్మత్తయిన భూమికను ధరించింది. తెలుగులో ఆ పాత్రను ఎవరూ చెయ్యలేరుగాబట్టే మనోరమ వేసింది. ఇతర ముఖ్య పాత్రలను గుమ్మడి, నాగభూషణం, అల్లురామలింగయ్య, రావికొండలరావు, రంగారావు, సి. హెచ్. కృష్ణమూర్తి, నరసింహరాజు, రోజారమణి, పండరీబాయి, అనురాధ, శ్రీవాణి, విజయలక్ష్మికన్నారా పోషించారు. రాజశ్రీ విడుదల.

### నందిని ఫిలింస్!

'అత్తలు – కోడళ్లు' చిత్రాన్ని అందించి, "ఇల్లు – ఇల్లాలు" తో అంతస్తును పెంచుకొన్న యీ సంస్థ "పండంటి సంసారం" ను ప్రారంభించి చాలాకాలమైంది. ఇప్పుడిప్పుడే పూర్తయ్యే ఘట్టాన్ని చేరుకుంది.

"పండంటి సంసారం" చిత్రంలో మహానటి భానుమతి తన మహత్మ్యాన్ని చూపెట్టి, చిత్ర విజయానికి ఎంతో తోడ్పడినట్లు తెలిసింది. పాత్రలో విశిష్టత వుండబట్టే, ఆమె పోషించింది. నవ్వులరాజా రాజబాబు సరికొత్త పాత్రను పోషించిన యీ చిత్రంలో గుమ్మడి, శ్రీధర్, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, రావుగోపాలరావు, మణిమాల, బాలకృష్ణ, ఛాయాదేవి, గిరిజారాణి, జగ్గారావు, పొట్టిప్రసాద్, సాక్షిరంగారావు, అపర్ణ మరియు భారతి ముఖ్య భూమికలను ధరించారు.

సంగీతాన్ని మహదేవన్, ఛాయను సుకదేవ్, రచనను అప్పలాచార్య, సహ దర్శకత్వాన్ని బ్రహ్మానందరావు నిర్వహించిన యీ చిత్రాన్ని జె. వి. రామసుబ్బయ్య నిర్మించారు. కె. సుబ్బిరెడ్డి సమర్పించు ఈ చిత్రానికి కథను పి. లలిత రాసింది. భార్య రాసిన కథకు సినిమా అనువాదాన్ని సమకూర్చి, దర్శకత్వాన్ని పి. చంద్రశేఖరరెడ్డి నిర్వహించారు.



"బాబు"లో ముద్దుగుమ్మలు వాణిశ్రీ, లక్ష్మి

# ఉత్తరాలు

### ముఖ చిత్రం

మా అభిమాన తార పూర్వశి ముఖ చిత్రంతో వెలువడిన ది 29—11—74 పత్రికలో ప్రచురింపబడిన సి. ప్రేమజగారి లవ్‌స్టోరీలో లవుడుగారి ప్రేమలేఖలో "ఎటొచ్చీ మీ పేరుకి ముందు(మర్యాదకు)డు యూ అనే ఇంగ్లీషు మాటలు, చివర్ని 'పి' అనే తెనుగు పదం చేర్చాలి" అని వ్రాశారు కాని 'పి' అనేపదం నిజానికి ఇంగ్లీషుపదం కాని రచయిత్రిగారు దాన్ని తెనుగు పదం అనడంలో అర్థమేమిటో తెలియ లేదు!

యువసాహితీసమాఖ్య (యలమంచిలి)

## ఘంటసాల పాటల పోటీలు

అమర గాయకులు పద్మశ్రీ ఘంటసాల ప్రథమ వర్ధంతి సందర్భముగా ఫిబ్రవరిలో జరుగు ఘంటసాల పాటల పోటీలలో పాల్గొని ముఖ్యమంత్రి శ్రీజలగం వెంగళరావు డాక్టర్. సి. నారాయణరెడ్డి, శ్రీమతి మాదిరెడ్డి సులోచనగార్ల సమక్షంలో పద్మశ్రీ బాల మురళీకృష్ణచే బహుమతి అందుకోండి. వివరాలకు సొంత చిరునామగల 25పైసలు కవరు జతపర్చి వంశీఆర్ట్సు థియేటరు, 1—8—702/31, శంకర్ మఠం ప్రక్క, హైదరాబాదు — 500044, నుంచి పొందండి.



### అహం — అనురాగం

'అహం— అనురాగం' సీరియల్ (13.12.74)లో దిగువ వుదహరించిన ఒక సంఘటన వాస్తవానికి దూరముగా వుందని తెలియచేయడానికి చాలా విచారిస్తున్నాను.

"శ్యామల కాఫీ కప్పు చంద్రానికి అందిస్తున్నప్పుడు చంద్రకావాలని శ్యామల కుడిచేతి నాలుగువేళ్ళు రావాలని తాకేడు. ఆ చిన్న సంఘటనకే శ్యామల చాలా బాధపడి తన కుడి చేతి నాలుగు వేళ్ళను కణ కణ మండుతున్న స్టౌ మంటలో కాల్చుకొన్న సంఘటన ఏ మాత్రము సహజత్వముగా లేదు."

ఎంత పతివ్రతా శిరోమణి అయినా, పరపురుషుడు (తనకు యిష్టము లేనివాడు) తన చేతివేళ్ళను తాకినంత మాత్రానికే ఆ చేతి వేళ్ళను కాల్చుకొనే విషయము ఏ మాత్రము సమంజసముగా లేదు (ఈ నవనాగరికత రోజుల్లో)

సి. రఘుబాబు, కృష్ణవేణి. (కాకినాడ)

### కథలు

20.12.74 సంచికలో 'పైసా కోసమా?' కథ చాలా బాగుంది. నిజంగా పైసాకోసం జరిగే పాట్లలో ఇలాంటివి ఎన్ని జరుగుతున్నవో? 'ఇద్దరమ్మాయిల ! సీరియల్ కథ 'బంధ్బు పోయి వోడలవుతవి' నిత తి అలాగే మారి పోయింది.

మాయం చేశారు.

ఉన్న వార్తలయినాచాలా

స్తున్నందుకు మా ధ

శోభావెంకటరెడ్డి, (

అభిమాన సంఘము,

* *

ఈ వారం (13.12.74) ఆంధ్ర పత్రికలో ప్రచురితమైన కథలలో " మందు" అనే కథ చిన్నదైనా చాలా బాగున్నది.

మర్రి మల్లయ్య, (మామిడాలపల్లి.)

* * *

13—12—74 పత్రికలోని ఆదివిష్ణుగారి "తల్లి" సమాజంలోని ఎన్నో మధ్యతరగతి కుటుంబాలకు దర్పణంగా వుంది.

విప్పగుంట. నరసింహారావు, (బాపట్ల.)

* * *

ఈ వారం మూడు కథలూ చాలా బాగున్నాయ్! ముఖ్యంగా ఆదివిష్ణుగారు వ్రాసిన "తల్లి" కథ చాలా బాగుంది! ఒక విధంగా ఇన్ డైరెక్టుగా కుటుంబ నియంత్రణ పాయింట్ కథకు ఏ మాత్రం ఎబ్బెట్టుగా లేకుండా పాఠకుడు వూహించుకో గలిగేట్టు వ్రాసారు ! "ముగింపు మీకూ తెలీదు" హైటిల్ చాలా బాగుంది! కథ మాత్రం పాతకథేమిలాగే అన్పించింది !

కళాధర్, (రాజమండ్రి.)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 – 1972)

శుక్రవారం : 10-1-'75
ఆనందనామ సం. మార్గశిర బ. త్రయోదశి
సంపుటము : 68 సంచిక : 17

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సర చందా — రు. 31–20 పై.
ఆరుమాసాల చందా — రు. 15–60 పై.
విడిప్రతి వెల 55 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ :
నటి జూనియర్ కాంచన


**కథలు :**

| | | |
|---|---|---|
| రానిక నీకోసం సఖీ ... | ... | 14 |
| పరో ప్రపంచం | ... | 34 |

**సీరియల్ కథలు :**

| | | |
|---|---|---|
| భవబంధాలు (ప్రారంభం) | ... | 10 |
| డైవోర్స్ – '70(నాటకం) | ... | 18 |
| అహం—అనురాగం | ... | 27 |

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు—4, లోకంపోకడ, ఫాలాక్షుని డైరీ—6, హైదరాబాద్ నోట్‌బుక్—7, సినిమా — 23, డాక్టర్ సలహాలు — 31, ప్రశ్నావళి — 33, ధర్మపథం—38, వారఫలం—44, అవీ — ఇవీ లన్నీ—45.


మా పాఠకులకు
నూతన సంవత్సర శుభాకాంక్షలు



కన్నీరు ఒక్కటైనా ఏడుపులే వేరు... వేరూ...
జీవితమే ... చావు పుటక వేరు. వేరూ!
ఆకాశమొక్కటైనా ఎండా వానా వేరు... వేరూ...
వెలుగనేది ఒక్కటైనా సూర్యుడూ చంద్రుడూ వేరువేరు

**రాజబాబు** సమర్పించు
బాబ్ అండ్ బాబ్ ప్రొడక్షన్స్

# ఎవరికివారే-యమునాతీరే!

స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం: **దాసరి నారాయణరావు**
నిర్మాతలు: **డి.కుమార్‌జీ శ్రీరాజ్**

నిర్వహణ: **దిడ్డి శ్రీహరిరావు** కథ: రాజబాబు సంగీతం: చక్రవర్తి ఛాయాగ్రహణం: కన్నప్ప ఎడిటింగ్: బాలు కళ: భాస్కరరాజు

TARAKARAMA













# ఫాలాక్షుని డైరీ

## ఆకలి చావులు బయటపెట్టే అపోజిషన్

తమిళనాడు రామనాథపురం జిల్లాలో ఆకలిబాధకు తట్టుకోలేక, లేక చేసేదీలేక పాయిరవై మంది చని పోయారట. ఈ విషయం కమ్యూనిస్టుపార్టీ పార్ల మెంటు మెంబరు మిస్టర్ కళ్యాణసుందరం తెలియ జేశారు. అవును అపొజిషనువారే అలాటివిషయాలను లాగేది.

## దంతాల జబ్బులు—తీపి

దంతక్షయం ఎక్కువగా రాకూడదన్నా, దరికి రానేరాకూడదన్నా ఎక్కువగా తీపి తినాలట. కానీ అదే తీపిని పొద్దస్తమానూ తింటే దంతాలకు సంబం ధించిన రోగాలు బోలెడొచ్చేస్తాయట. వీలున్నంత, తినగలిగినంత ఒకేసారి భోంచెయ్యడం దంతాలకు ఆరోగ్యమని అమెరికా జాతీయ దంత పరిశోధన సంస్థకు చెందిన డాక్టర్ విలియమ్ బోవెన్ అన్నారట పంచదార వీశెంత ! అదే కిలో స్వేఛ్ఛా బజారులో ఎంత!

## బుడ్డిపాలు లివర్ని పాడుచేస్తయ్యా !

బుడ్డిపాలు సేవిస్తే లివరుకు కొవ్వుపడుతుందని, తత్ఫలితంగా లివరు దెబ్బతింటుందని నైజీరియాకు చెందిన డాక్టర్ ఒకోన్క్వ, న్యూయార్క్ కారెల్ని ... గానికి చెందిన డాక్టర్ నైసెల్లా ఏకాభి ... వచ్చారట. బుడ్డి (అనగా వెన్న తీసేసి అమ్మేపాలని అర్థం)పాలలో వోరోటిక్ వుంటుందని, ఇది లివరుకు కొవ్వెక్కి ...ందనీ వారన్నారట.

## ...గారు గొలుసుకో ముద్దు

...కారులో వో వస్నెల విసుక్ర దారినపోయే ... ఆపి, తనను కొందరు గూండాలు తరుము ...న్నారని భయపడుతూ చెప్పి, అతన్ని బతి మాలి కారులో ఎక్కిందట. ఆను కోన్కి మాద యిద్దరూ కలిసి వో హొటలుకు వెళ్ళి కాఫీ తాగారట. ఆనక ఆయనకు థాంక్సు చెప్పి, కారు దిగి వెళ్ళిపోయే ముందరానుందరి కారులోనే అతగాడ్ని దభీల్న కవుగలించుకుని, ఉద్రేకంతో నొక్కి వదలి, "బై బై" అనేసి, దిగి వెళ్ళిపోయిందట. ఈతనా హాయినుంచి యిహలోకానికొచ్చి చూసుకునేసరికి మెడలో బంగారు గొలుసు కనబళ్ళేదట. ఆ గొలుసు వెల రెండున్నరవేలట. ఎంత ఘాటుముద్దో !

## పాలమ్మే యంత్రం

బటను నొక్కి గిన్నెపడితే వో అర్థలీటరు పాలు వచ్చే పద్ధతిని పంపులతో ఢిల్లీలో పాలబూతులను ప్రవేశపెట్టారట. దీనికి కావలసిన నాణాలు వంటివి ముందుగా యీ బూత్‌ల వద్ద కొనుక్కోవాలట. రోజులో ఏటయిములో నయినావెళ్ళి ఆ నాణెంకోసం వేసి నొక్కితే పంపులోంచి అర్థలీటరుపాలు వస్తా

యుట. ప్రపంచంలో యీ పద్ధతి ప్రవేశ పెట్టిన దేశాలలో మన దేశం రెండోదట. మొదటి దేశం మెక్సికో అట! ఆయిడియా బాగుంది కానీ, పాం కన్నా నీళ్ళు పెడితే బాగుంటుంది. దేశంలో చాలా చోట్ల కొనుక్కుందామనుకున్నా నీళ్ళు దొరకటం లేదు గదా! థింక్‌వెల్!

### గర్భవతులపై మందుల ప్రభావం

గర్భవతులుగా వున్నవారు ఆ రోజులలో అధికంగా మాత్రలు, టానిక్కులు, తదితరాల వంటివి సేవించడంవల్ల, గర్భాధారణ జరిగిందా లేదా అనీ తదితర కారణాలవల్ల అస్తమానూ యక్సరేలు తీయించుకోడంవల్ల, అతిగా త్రాగడం, ధూమపానంవల్ల వారికి పుట్టేపిల్లల మెదడు సరిగా ఎదగడం లేదని,పుట్టుక లోనే అలాటివారి పిల్లల బుద్ధి మందగిస్తోందనీ కలకత్తాలో డాక్టర్ బీ. యన్. రాయిగారన్నారట.

### బస్సుల పరుగుపోటీలో హతుడు డ్రైవర్

ఆరవ తేదీ సుప్రభాత సమయానికొస్తసింటా హైదరాబాదు "హిందూస్థాన్ ఎయిరో నాటిక్స్"కు చెందిన బస్సులు వో రెండు (13, 8) వోదాన్నొకటి ఉత్సాహంగా తరుముకుంటూ ఆవేశం హెచ్చి, గతి తప్పి, తోసుకున్నాయుట. జరగబోతున్న ప్రమాదాన్ని పసిగట్టిన 13వ నెంబరు బస్సుడ్రయివరు చెంగునో గంతేసి బ్రతుకు జీవుడా అనుకునేలోగానే వెనుక నుంచి వస్తున్న ఎనిమిదో నెంబరు బస్సు అతన్ని బలితీసుకుని, కాస్త అసింటా వెళ్ళి ంిందట. దాంతో ఆ 13వ నెంబరు బస్సు ( విరాతస్సుకుని, రక్తపు మడుగులో అతనికి (డిశంబరు రెండో తేదీన క్రితమే వివాహం అయ్యిందట. ఆ బస్సు ప్రయాణం చేస్తున్నవారిలో 18 మందికి వోమోస్త గాయాలు, నలుగురికి బాగా గాయాలు తగి

### నిరుద్యోగుల నిండైన అభివృద్ధి

దేశంలో నిరుద్యోగుల సంఖ్య నానాటికి అభివృ తోందట. ఈ విషయం రిజర్వు బ్యాంకి తన నివేదిక లోనివేదించింది. 1973 జూన్ నాటికి 75.96 లక్షలుంటే అది 1974 జూన్ నాటికి 83.54 లక్షలుగా అభివృద్ధియిందట. వీరిలో విద్యావంతులయిన వారు 1972జూన్ నాటికి 26 లక్షలుంటే 1973 జూన్ నాటికి 35.29 లక్షలయి కూర్చుందట— ఫెంటాస్టిక్కిం ప్రూమెంట్!

### ఘరానా దొంగలు

గుంటూరు జనరల్ ఆసుపత్రికి చెందిన హవుస్‌సర్జనుల (స్త్రీల విభాగం) గదిలోకి ఒకటవ తేదీన పట్టపగలు వో యిద్దరు యువకులు ప్రవేశించి, తలుపులోపలకు గడియవేసి — వేసి. . . . కత్తులు చూపి,లోపలున్న స్త్రీలను భయపెట్టి వారి ఆభరణాలు తస్కరించుకు పోయారట. ఈ నగల వెల మూడువేల రూపాయలైనా వుంటుందట. ఆ యిద్దరుదొంగలూ ఇంగ్లీషులో మాట్లాడేరట ●



## హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

### ముఖ్యమంత్రి హితవు :

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు డిసెంబరు రెండవవారంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం జర్నలిజం విద్యార్థులతో ముచ్చటిస్తూ, విద్యారంగాన్ని కుల, మత, ప్రాంతీయ తత్వాలకు అతీతంగా ఉంచాలని విద్యార్థులనూ, ఆచార్యులనూ, కులపతులనూ కోరడం ఉచితంగా ఉంది. 'మీరు రాజకీయాలలో ప్రవేశించాలనుకుంటే, చదువు ముగిసిన తర్వాత చేరండి. చదువు కొనేటప్పుడు వద్దు. మీరు స్వప్రయోజన పరులైన రాజకీయవాదుల మాటలకు మోస పోకండి. పాపం! మీరు అమాయకులు. తప్పు వారిదే" అని వారిని ముఖ్యమంత్రి హెచ్చరించారు. విద్యార్థులు ఆయన సలహా పాటించి, ఉన్నతవిద్యకోసం ప్రభుత్వం వెచ్చిస్తున్న కోటిరూపాయలు సవ్యంగా, పూర్తిగా వినియోగపడేట్లు విద్యా ప్రమాణాలు పెరిగేటు కృషిచేసా ంచవచ్చు.

ప్రోత్సహించడ ఎస్. ఆర్: అ ావు న శ్రీనివాస సాహితీసమితి ర్షికోత్సవం డిసెంబర్ రెండవ శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా ంలో జరిగినప్పుడు, యువకుల ఉత్సాహాన్నిచూచి ఆనందించని వారుండరు. అధ్యక్షత వహించిన ఆకాశవాణి అడిషనల్ డైరెక్టర్ శ్రీ ఆచంట సూర్యనారాయణ మూర్తి, సమితి నిర్వహించిన కథానికల పోటీలో 'మునిమాణిక్యం అవార్డు'ను అందజేసిన శ్రీ రావూరి వేంకట సత్యనారాయణరావు 'ఈనాటికవిత,' 'రాగారాధన' అనే రెండు యువకవుల కవితాసంపుటాలను ఆవిష్కరించిన డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం హాస్యం ప్రాధాన్యం గురించి, యువకులు చదివి వ్యుత్పత్తి అలవరచుకోవలసిన అవసరం గురించి ప్రసంగించారు. యువకవి సమ్మేళనంలో పలువురు పాల్గొన్నారు. వారు గానం చేసిన కవితలలో

"మాధవరావు మంచివాడు,
మంచివాడు మాధవరావు,
వాడు మంచి మాధవరావు
మంచిమాధవరావు వాడు"

అనే వ్యంగ్య రచన శ్రోతలను విశేషంగా ఆకర్షించింది. సమితి కార్యదర్శి శ్రీ తుంగతుర్తి విశ్వనాథశాస్త్రి ప్రారంభంలో సమితి ఆశయాలు వివరించారు, అక్కిరాజు జనార్దనరావు ధన్యవాదాలర్పించారు.

### ఎ.ఎన్.ఎస్. రజతోత్సవం :

క సమాచార శాఖామంత్రి శ్రీ పిడతల రంగ డిసెంబర్ 14న ఉరుదూహాలులో అసోసి డ్ న్యూస్ సర్వీస్-వార్తా సంస్థ రజతోత్సవానికి అధ్యక్షత వహించినప్పుడు ప్రసంగిస్తూ, రాష్ట్రంలో ఇంకా ఎన్నో వార్తాపత్రికలు వుండడం అవసరమని, ఎవరైనా స్థాపిస్తే, వాటికి ప్రభుత్వం అన్ని విధాలా సహాయం చేయడానికి ప్రయత్నిస్తుందని అనడమూ, ఉత్సవ ప్రారంభకులు శ్రీ జలగం వెంగళరావు ఎ. ఎన్. ఎస్ కృషిని



ప్రశంసించడమూ పత్రికా రచయితులకందరికీ హర్షదాయకమే. కాని, పత్రికలకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉండాలనీ, ఆ స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వం తగ్గించదలిస్తే, ప్రజాస్వామ్య అభివృద్ధికి భంగకరమని ఆర్థికమంత్రి

## హైదరాబాద్ నోట్ బుక్

ఉద్ఘాటిస్తూనే, ప్రభుత్వాన్ని పత్రికలు విమర్శించడం న్యాయంగాను, నిర్మాణాత్మకంగాను ఉండాలనడం శ్రోతలను కొంత ఆలోచనాపరులను చేసింది. విమర్శలను సహించేగుణం మనప్రజలలోను, ప్రభుత్వానికీ తక్కువ. ఎంత నిష్పక్షపాతంగా, న్యాయంగా విమర్శించినా నిర్మాణాత్మకం కాదని ఆక్షేపించే అవకాశం వుంది. ఉస్మానియా విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ శ్రీ నరోత్తమరెడ్డి పత్రికల ప్రదర్శనాన్ని ప్రారంభిస్తూ ఎ.ఎస్.ఎస్. సంపాదకుడు శ్రీ ఎస్. రజాఆలీ సమర్థతను ప్రశంసించారు. ఈ ప్రదర్శనంలో శతాబ్దిక్రితం హైదరాబాద్‌నుంచి ప్రచురించిన పత్రికలూ ఉన్నాయి.



### బాలికల ప్రతిభ :

ఇటీవల బహుమతులు, ప్రశంసలు పొందిన ఇద్దరు బాలికలను ప్రశంసించక తప్పదు. వీరిలో ఒకరు చిరంజీవి పాఖాల్ చిల్కా (లక్ష్మి). ఈ 13 సంవత్సరాల బాలిక ఆల్ ఇండియా ఛైల్డ్ ఆర్ట్స్‌క్లబ్ నిర్వహించిన వర్ణచిత్రరచన పోటీలో ప్రథమ బహుమతి పతకం సంపాదించింది. ఈపోటీ అప్పటికప్పుడు చిత్రరచనచేసే 'స్పాట్ కాంపిటీషన్' ఆశుచిత్రరచన పద్ధతిలో జరిగింది. చిల్కామ్మ ఇంతవరకు యాభై, అరవై రకరకాల బొమ· వేసింది. ఇదివరకు సిద్దిపేట, వెల్ల జరిగిన పోటీలలో బహుమానాలు చిల్కామ్మ సుప్రసిద్ధ చిత్ర ాఖాల్ తిరుమలరెడ్డి, డాక్టర్ ాశోదారెడ్డిగార్ల కుమార్తె. రెండవబాలిక ాలీరావు. వయస్సు ఆరుసంవత్సరాల లోని నృత్యాల రికార్డులతో నృత్యం ) జంటనగరాలలో ప్రదర్శనాలిచ్చింది. ్బ్బువారు ఈమెకు పెక్కు బహుమతులుఇచ్చారు. ఈమె 'కళాప్రపూర్ణ' శ్రీ నిడుదవోలు వేంకటరావు గారి పౌత్రి. పేరు లవలి. కాని, లవలీరావు అని నృత్య బృందాలలో ప్రసిద్ధురాలు.

### ఉపశ్రుతి :

"ప్రతి నాయకుడూ సమైక్యం సమైక్యం అని అంటాడు. కొత్త పథకం ప్రకారం ఈ జిల్లా కాకి పక్కజిల్లాపై వాలడానికి అవకాశం లేదే ! ఏమీ అర్థంకావడంలేదే?" అని ఒక అమాయకుడు నన్ను ప్రశ్నించాడు. నేను ఏమిచెబుదామా అని తల గోక్కుంటున్నాను. "సర్కార్ ధర్మః యోగినా మవ్యగమ్యః" అన్నాడు నా పక్కన ఉన్న పెద్దమనిషి.




ONE HUNDRED RUPEES
100
TO PAY THE BEARER THE SUM OF ONE HUNDRED RUPEES

*[గత సంచిక తరువాయి]*

మనోరమ అప్రతిభురాలయింది. శరీరం కంపించింది. రోడ్డుకూడ దాదాపు నిర్మానుష్యంగా వుంది. తను ఏ పరిస్థితిలో వుందో గుర్తించుకుంది. వెంటనే పరుగులు తీస్తున్నట్లు ముందుకు నడచింది. వెనుక నుంచి 'మనోరమా' అని వినిపిస్తూనే వుంది. మనోరమ వెనక్కి చూడలేదు. ఆగలేదు.

ఇంటికి వచ్చినా వణకు తప్పలేదు.

"ఏమిటి మనో అలా వున్నావ్ ?" వదిన అడిగింది.

మనోరమ ఏమీ చెప్పలేదు. చెప్పలేక పోయింది. చెప్పాలని వున్నా ఏవో సాంఘిక

# భవబంధాలు

## చెళ్లూరి సీతారాజేశ్వర

సూత్రాలు అడ్డువచ్చి మాట్లాడ

కేశవయ్య అడిగిన ప్రశ్న ఓపికగా జవాబులిచ్చి, మేడమీద తన ...లోకి పోయి పడుకుంది. ఆ దృశ్యమే కళ్లముందు వుంది. ఎవరు వాడు? రోమియోలాగున్నాడు. మనోరమకి భయం కల్గించే సంఘటనలు—యివే రకంవి ఎన్నో గుర్తువచ్చాయి. పెద్దపెద్ద దీపాలు వెల్గుతున్న, చీకటిలాంటి భయం ఆమెను తరుముకు వచ్చింది.

మర్నాడు కాలేజీలో లతతో చెప్పింది.

"ఎవడో పోకిరీ వెధవలా వున్నాడు. అలాంటి వెధవల్ని లెక్కచెయ్యక్కర్లేదు."

"నీ సాహసం నాకు లేదు లతా !"

వారం రోజులు గడిచిపోయినాయి. మనోరమ తాత్కాలికంగా ఆ భయాన్ని మరచిపోయింది. ఒకవేళ ఎప్పుడయినా జ్ఞాపకం వచ్చినా తనకి తానే ధైర్యం చెప్పుకునేది. ఆ రోజు బాగోక అలాగ జరిగింది. రోజూ జరుగుతుందా? అని సర్ది చెప్పుకునేది. తన పిరికితనాన్ని, కంగారుని అణచుకుంది.

ఓ రోజు సాయంత్రం బాల్కనీలో జాటనీ రికార్డు తయారు చేస్తూ, రిఫరెన్సుపుస్తకం తిరగవేస్తూండగా ఓకాగితం క్రింద పడింది. కుతూహలంగా తీసింది.

"డియరెస్ట్ మనో,

ఆ రోజు అలా పరుగులు తీశావేం...అబ్బా రన్నింగ్ రేస్‌లో నీకు ప్రయిజు యివ్వచ్చు. ఆ తర్వాత నీ కోసం కాలేజీ అంతా వెతికినా నీ దర్శనం కావడంలేదు. మనో...నిన్ను చూడని రోజున నాకు అమావాశ్య. ఏమీ తోచదు. ప్లీజ్ మనో రోజుకి ఒకసారయినా నీ దర్శనం యియ్యి. ఆ వరం ప్రస్తుతానికి చాలు. చంద్రునికోసం చకోర పక్షిలా, భానుడి కోసం కలువలా...నీకై ఎదురుచూస్తున్నాను.

...త్తరం కోసం వ...స్తావు కదు

మ... ...ని కాఫీ తీసుకురావడం దాచేసి, ఆలోచనలతో కాఫీ అ... లోపల ఎన్నో ప్రశ్నలు !

ఆ ఉత్తరం ఈ పుస్తకం... వచ్చింది ?

"మరదలుపిల్ల పరాకుగా వుంది. ప్రేమలో పడిందేమిటి?" నవ్వుతూ వేళాకోళం చేసింది మాధవి.

వదినకేసి చురుకుగా చూసింది.

"నీ కెప్పుడూ వేళాకోళమే." అన్నది, మాత్రం పైకి.

కాని లోపల బెరుకుగానే వుంది. వదిన ముందరగా ఈ పుస్తకంతీసి ఆ ఉత్తరం చూసిందేమో... అందుకే అలాగ అందేమో··· రకరకాల ఆలోచనలు పీడించాయి.

వెంటనే నౌకర్ని లతకోసం పంపింది.

స్నేహితురాలు లతకూడ ఆ వీధిలోనే వుంటోంది. ఆమె నాన్నగారు ఆయుర్వేద వైద్యులు. రెండు కుటుంబాల మధ్య రాకపోకలున్నాయి. చిన్నప్పటినుంచి కలసి మెలసి వున్నారేమో లత,మనోరమ నీళ్లుపాలు క్రింద కల్సిపోయారు. ఏమాత్రం కంపనం రేగినా మనోరమ భరించలేదు. దాని పీడనానికి తట్టుకోలేదు. కాని లత మంచి స్థయిర్యం కలది. ఎలాంటి ఛాలంజీకయినా ఆమె నిలుస్తుంది. ఈ భేదంవల్ల వారి స్నేహితం మరింత వృద్ధి పొందింది. మనోరమకి ఆమె మంచి డిఫెన్సు.

"పైకి నంగనాచిలా వుంటావ్, హీరోయిన్‌వయి కూర్చున్నావు." వస్తూనే లత దండకం అందుకుంది ఆమెని ఏడిపించడానికి.

"వదినా, నువ్వూ ఒకటే." మూతి ముడుచుకుంది.

లత ఉత్తరాన్ని చదువుతోంది.

"ఎవడీ రాస్కెల్. నామీద పడ్డాడు." రోషంగా అడిగింది మనోరమ.

ఉత్తరాన్ని చదివి, "మొత్తానికి చక్రవర్తినే పట్టావు. అన్నట్లు యిది ఎలా వచ్చింది... పోస్ట్‌లోనా ?" ప్రశ్నించింది.

మనోరమ చెప్పింది. "అదే అర్థం కావడంలేదు."

...లో అర్థంకానిది ఏముంది. ను...
...తీసుకుని లైబ్రరీ నుంచి నేరుగా

...మ ఆలోచిస్తూ : "...
పుస్తకం తీసుకుని రీడింగ్ రూం... 'మదరిండియా' తిరగవేశాను" అన్నది.

అప్పుడే నీ లవర్ ఈ ఉత్తరాన్ని ...
...డు."

"ఛీ... అసహ్యంగా మాట్లాడక."

ఆ తర్వాతరోజుకి ఒకటి చొప్పున కాలేజీ ఎడ్రస్సుకి మనోరమకి ఉత్తరాలు అందుతున్నాయి. ఆదివారంకూడ ఎలాగోలా వస్తున్నాయి. నిస్సహాయత, భయం ఆవరించి మనోరమని విచారమయం చేశాయి. ఈ ప్రవాహం ఎలాగ దాటాలో ఆమెకి తెలియలేదు. ఈ సమస్యవల్ల ఆమె ఆనందం హరించిపోయింది.

---

*జరిగినకథ I*: మంగళ పెళ్లికి హైదరాబాద్ వెళ్లి తిరిగి వస్తున్న డాక్టర్ మనోరమను రైల్లో కలిసి తాను దొంగగా మారడానికి ఆమెయే కారణమని నిందిస్తాడు చక్రవర్తి.

ఒకసారి కాంటీను నుంచి వస్తోంది.

"మనోరమా" వెనకనుంచి పిలుపు.

మనోరమ ధైర్యంగా ఆగింది.

చక్రవర్తి దగ్గరకి వచ్చాడు. "నీ ఉత్తరం కోసం చూస్తున్నాను."

"ఎందుకు ?" తీక్షణంగా అడిగింది.

"నువ్వంటే నాకిష్టం."

"ఏ మిస్టర్ మర్యాదగా మాట్లాడు."

"మనో" అతడు ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

చక్రవర్తి చెంప 'ఛళ్'మంది.

"ఈ పరాభవం కోసమే యింత మొండి సాహసం చేశావ్. కాని నిన్ను యింతటితో వదలను" బుసలుకొడుతూ అక్కడ్నుంచి వెళ్లిపోయింది.

"వదలకు. రిపోర్టియ్యి ప్రిన్సిపాల్ కి. రోగం కుదురుతుంది." లత హెచ్చరించింది.

చక్రవర్తి రాసిన ఉత్తరాలు చూపించింది. క్యాంటిన్ దగ్గిర చక్రవర్తి ప్రవర్తన చెప్పింది ప్రిన్సిపాల్ తో. పైగా లత సాక్ష్యం.

చక్రవర్తికి కాలేజీనుంచి బహిష్కరణ. ఏ ఫలితం.

"తను తొందరపడిందేమో" రమ కటి రెండుసార్లు మధనపడి తానే ధైర్యం చెప్పుకుంది. ందులో తన అపరాధ వర్తి ప్రవర్తన అతడికి . తను ఈ నిర్ణయం తీసుకోకపోతే. టికి చక్రవర్తి మితిమీరి వుండే మవక్రంలో బంధింపబడి చక్రవర్తికి విధించబడి స నదేనని భావించింది. ఈరకంగా తను సమస్యనుంచి విముక్తురాలయింది. ఇది తనకి మేలు చేసిందితప్ప కీడు చెయ్యలేదు.

అతి కొద్దికాలానికే చక్రవర్తి వ్యవహారం మరచిపోగల్గింది.

నాటికి నేడు రైలులో సమావేశం జరిగింది హఠాత్తుగా.

అవాంఛనీయ సంఘటన !

"మెరిసేదంతా మేలిమి కాదు మనోరమా. పైగా అందమైన దానినన్న అహం వుంది నీకు. అందుకే యింత అత్యాచారం చెయ్యగలిగావు. నా వ్యక్తిత్వంపై దారుణమైన దెబ్బ తీశావు. నా పతనాన్ని చూశావ్. నిజంగా నువ్వు రాక్షసివి." చక్రవర్తి ఆవేశం ప్రదర్శించాడు.






మనోరమ మౌనం వహించింది.

ఇది చక్రవర్తికి మరీ కోపం రప్పించింది. కొత్త సిగరెట్ ప్యాకెట్టులో నుంచి సిగరెట్టు తీసుకుని వెలిగించుకుంటూ, "నిన్ను నువ్వు ప్రశ్నించుకో మనోరమా ... నీ తప్పు తెలుస్తుంది. జీవితం మీద ఎన్నో కలలు కన్నాను. ఎంతో నమ్మకాన్ని పెంచుకున్నాను. అన్నీ తోసి రాజన్నావే. నీ అమృత హస్త పోతే నేనూ డాక్టర్‌గా తయారయే తీవ్రంగా అన్నాడు.

చక్రవర్తి ఆవేశాన్ని ఆమె పట్టించుకోలేదు. ఓడిపోయిన మనిషి యొక్క హావభావాలు రక రకాలుగా వుంటాయి. వాటి యొక్క లోతు కూడ బహు తక్కువ. చక్రవర్తిని పరిశీలనగా చూసింది. ఒళ్లంతా దిగులు వ్యాపించి వుంది. ఖరీదైన దుస్తులు కళలేని శరీరానికి విలువని ఏర్పర్చలేక పోతున్నాయి.

"నెపం నామీద వెయ్యక. నా రక్షణ కోసం నేను జాగ్రత్తలు తీసుకున్నాను. నాపై దురాక్రమణ చెయ్యాలని చూసి దెబ్బ తిన్నావ్. నీ సరిహద్దులో నువ్వుంటే ఈ ఆపద నివారింపబడి వుండేది. అయినా గతాన్ని గురించి ఆలోచించడం అంత మంచిది కాదు. ఒలికిపోయిన పాల గురించి ఎంత విచారించినా ఫలితం లేదు."

"నీ నీతులు నా కవసరంలేదు. ఎంత చచ్చిన పామునయినా నాకూ పౌరుషం వుంది. నా జీవితాన్ని యిలా నరికిన పాపం వృథా పోదు."

## భవబంధాలు

"శాపం యిస్తున్నావా ?" మందహాసం చే ... ను.

... నాలో కరడు కట్టుకుని నన్ను ... ట్టి చాలె ... చెయ్యకు. నువ్వు ... మరచిపోలేదు. ... హు తక్కు దొం ... పంచానికి ... తున్నా ... మనుషుల్ని ఎలా దబ్బ నాకు ... ల్సు"

ఆ ఉద్వేగానికి మనోరమ ... పోయింది. భీరవత ఆవరించింది. ... చూసుకుంది. ఇంకా విజయవాడ చేరడానికి అరగంట వ్యవధి వున్నది. చక్రవర్తిని రెచ్చ గొట్టడం తనకి అనవసరం. ఏ విధంగానూ లాభంకాదు. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అతడు తనవల్ల దెబ్బతిని వున్నాడు. ఆ కసి అతడిలో వుంది. అది పశుత్వంగా మారిపోవడానికి ఎంతోసేపు కానక్కర్లేదు. అందులోను చక్రవర్తి పెరిగే వాతావరణ లక్షణం దౌర్జన్యాన్ని యిట్టే ప్రేరేపిస్తుంది. ఈ బాక్స్‌లో తనకి డిఫెన్సు ఏమీలేదు. చక్రవర్తి కొ ఎర్సన్ ఎంప్లాయ్ చేస్తే తను ప్రతిఘటించలేదు. అందుకే మౌనంగా వుంటేసరి.

పదినిముషాలు కరిగిపోయాయి.

నిశ్శబ్దాన్ని చీలుస్తూ చక్రవర్తి కంఠం ఎత్తాడు. "మనోరమా ... నీ జీవితం వడ్డించిన విస్తరి. ఆ భగవంతుడు నీ లాంటి వార్ని స్పెషల్‌గా తయారుచేశాడు. మీకు లోకంలోని బాధలు, సమస్యలు అర్థం కావు. కాని ఒకటి మాత్రం గుర్తు పెట్టుకో. ఈ సంఘంలో మెసిలే జనంలో దురదృష్టవంతులే ఎక్కువ. విషాదమే వాళ్లకి దేముడిచ్చిన వరం. ఏ వెలుగు కోసం ఆశపడుతున్నారో, దాన్ని వాళ్ల జీవితకాలంలో చూడలేరు. పెంచుకున్న ఆశలు వేరు. ఎంచుకున్న జీవితం వేరు. రెంటికీ ఏ మాత్రం సామీప్యం లేదు. వీటి సంఘర్షణలో జీవితం ఎటు పోతోందో, ఎందుకు పోతోందో కూడ అర్థం కాదు."

చక్రవర్తి గొంతుక గాద్గదిక మయి పోయింది. అందులోని దైన్యానికి మనోరమ కదిలింది. చక్రవర్తిని జాలిగా చూసింది.

"సామాజిక వ్యతిరేకమైన ఏ క్రియా శాంతి నివ్వదు చక్రవర్తీ. హాయిగా చదువు కున్నావ్. దొంగ తనాలు మానేసి, సవ్యంగా కాలంగడిపితే నీ సమస్యలు అన్నీ తీరిపోతాయి. బ్రతుకులోని తీపి తెలుస్తుంది."

క్రూరంగా నవ్వాడు. "చాల్లే ... నీ ... ఎన్నయి ... చెప్పుచ్చు."

" ... ఉపన్యాసం యివ్వడంలేదు ... కున్నాను. దేనిమీదో కసి ... కరచేసుకో ... ఏకాంతంలో నీకు ను ... లోచించుకోగలిగితే బాగా తెలుస్తుంది."

... వర్తి ఆమెకేసి అసహ్యంగా చూశ ... స్సున పొంగింది. కాని ... అణచుకున్నాడు బలవం ...

రైలు వేగం తగ్గుతున్నది.

"ఇదిగో వెయ్యిరూపాయిలు. ... కో చక్రవర్తీ. నా దగ్గరవున్న మొత్తం ప్రస్తుతానికిదే" మనోరమ డబ్బు అందించింది.

చక్రవర్తి తీసుకోలేదు. ఎర్రబడ్డ కళ్లతో నిర్లక్ష్యంగా చూసి వెళ్లిపోయాడు బండి ఆగగానే. మనోరమ తాత్కాలిక సంభ్రమం పొందింది.

## 2

కేశవయ్య లాన్‌లో కూర్చొని పుస్తకం చదువు కుంటున్నాడు. గేటుదగ్గర హార్న్ విని తల ఎత్తాడు. మనోరమ లోపలికి వస్తోంది.

ఆయన ముఖం వికాసమయింది. సంతోషంతో వెలిగాయి కళ్లు. ఆమె రాకకోసం ఆయన కలవర పడుతున్నాడు. మనోరమ చెప్పిన రోజుకి రాలేదు. అదీ ఆయన కంగారు. ఇద్దరు నౌకర్లని హైద్రా

బాద్ ప్రయాణం చేయించాడు కూడా. మనోరమ రాకతో ఆయన దిగులంతా మరచి పోయాడు.

"వచ్చావా అమ్మడూ" ఎదురు వెళ్ళాడు.

"తాతయ్యా" చిన్న పిల్లలా ఆయన వడిలో వాలి పోయింది.

రామయ్య సూట్‌కేస్ లోపలికి తీసుకు పోతూ "నీకోసం తాతయ్య, నేను కలవరించి పోతున్నాం తల్లీ. రాత్రి బండికి నేను ప్రయాణమవుతున్నాను కూడ." అన్నాడు. వాడు నౌకరే అయినా ఆ యింట్లో తరతరాలనుంచి వుంటున్నాడు. మనోరమని కేశవయ్యలాగే అభిమానంతో వాత్సల్యంతో చూడగలడు.

"మీరంతా కంగారు మనుషులే రామయ్యా!"

తన కోసం రామయ్య, కేశవయ్య, వంటమనిషి కనకమ్మ, నౌకరు కుర్రాడు సోము ఎంతగా ఎదురు చూస్తున్నారో తెలిసి మనోరమ పొంగి పోయింది. ఆ పరిసరాలు, మనుషులు, ప్రకృతి మనోరమని అంతగా ప్రేమిస్తాయి. ఆమెపై చిక్కటి మమతా వర్షం కురిపిస్తాయి. ఒక్క రోజు ఆమె యింటిలో కనిపించక పోతే అందరూ పిచ్చెత్తి పోయినట్లు వుంటారు.

"ఒక్క రోజే కదా తాతయ్యా" మనోరమ కేశవయ్య దగ్గర వరండాలో కూర్చుని గారం చేసింది. తక్కిన వాళ్ళంతా కూడ అక్కడే వున్నారు.

"ఇకలాగే వుంటుందమ్మా. . . నీ ధైర్యం ...నీ? నీలా గుండె దిటవు చేసుకుని వూర్కో. అంతగా అవసరమయితే వై ...వ్వలేక. ...వా?"

...రి తాతయ్యా" ...తూ ...రా. . .డా. . . ...గార ...వచ్చేత్తారని ...య్యత ...ను." సోము ముందరికి వచ్చి ...బ...డి... ...రాచుకుంటూ పళ్ళికిలించాడు. వాడికసలే నత్తి

"సినిమా డబ్బులయినా గెల్చుకున్నావా?" మనోరమ నవ్వుతూ అడిగింది.

కేశవయ్య వారి వుత్సాహంలో పాలు పంచుకుంటూ "కనకమ్మా. . కబుర్లు తర్వాత చెప్పవచ్చు. ముందర అమ్మడికి కాస్త కాఫీ యివ్వు. ఈ నాలుగు రోజుల్లోను ఎంత చిక్కిపోయిందో చూడు" కనకమ్మని ఆదేశించాడు.

"రా. . అమ్మాయీ" కనకమ్మ లోపలికి దారి తీసింది. దగ్గుతూ. ఎంత ఆపుకుందామన్నా ఆగ లేదు.

"ఏం పిన్నీ నీ దగ్గు మళ్ళీ వచ్చిందా?"

"డాక్టర్ని చూడగానె అన్ని రోగాలు వస్తాయమ్మా.."

కనక... స్థానం ఆ యింట్లో వంటమనిషి. ఏళ్ళతరబడి ఆ యింటిని నమ్మకుని వున్నందుకు, పరాయి మనిషిలా కనిపించదు. కోడలు పోయిన ప్పటినుంచి ఆ యింట్లో ఆడ దిక్కు కరువయింది. వంట విషయం రోజు రోజుకీ సమస్య అయి పోయింది. కేశవయ్య వంట మనుషులను వెతికాడు నలుగురు ముగ్గురు కాసిని రోజులు వున్నారు. వాళ్ళ అలవాట్లు, గుణాలు కేశవయ్యకి నచ్చలేదు. ఇంతలో యింటి పౌరోహితుడు హఠాత్తుగా చని పోయాడు. ఆ కుటుంబానికి ఏ ఆధారము లేదు. కనకమ్మని తమతో ఉండిపొమ్మని ...కోరాడు అప్పట్నుంచి ఆమె కదే స్వంతిల్లు...

రెండు రోజుల దాకా మనో... తీరిక లభించలేదు. హాస్పిటల్ ... ...వూ... ...ద పడి... ...ని చూడగానే ..."డాక్టర్ ... ...ల్లు, పలకరిం... ...నం ...కున్నారు.

ఏ మాత్రం విసుగుదల చూపకుండా ప్రతీ ఒక్కర్నీ ఆప్యాయంగా పలకరించింది. ఆరోగ్యాన్ని పరామర్శించింది.

మరో నాలుగు రోజులు యాంత్రికంగా గడచి పోయాయి. మనోరమ పనినుంచి కాస్త తేరుకుంది.

ఓ రోజు సాయంత్రం రవుండ్సునుంచి వచ్చి

(40 వ పేజీ చూడండి)

ప్రశ్నావళికి తమ సందేహాలు పంపే వారు. కవర్‌పై లేదా కార్డుపై శీర్షిక పేరు వ్రాసి, సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ — 520003 అనే చిరు నామాకే తమ సందేహాలు పంపాలి.

సం.

# నాకనీకోసం సఖీ

## కృష్ణప్రియ





మనోరంజని మనస్సు చాలా అశాంతిగావుంది.

ప్రక్కనే కృష్ణవేణి ప్రశాంతంగా నిద్ర పోతూంది. మనోరంజని బాధగా నవ్వుకుంది. తనెప్పుడూఁయింతే. కృష్ణపక్కన పడుకుంటే తనకి నిద్ర రాదు. ఆమెనిచూస్తూ రాత్రంతా గడిపెయ్యడం తనకి అలవాటే. కృష్ణవేణి

గాఢంగా నిద్ర పోతూంటే ఆమె బారెడుజడని చేతుల్లోకి తీసుకుని హృదయానికి హత్తుకుంటూ, నిద్రిస్తూన్న కృష్ణ బుగ్గల్ని స్పృశిస్తూ నిట్టూర్పులు విడుస్తూ జాగరణ చెయ్యడం ఆమెకి పరిపాటి అయిపోయింది. ఆమె మేలుకుని వుండడానికీ, కృష్ణవేణి తొమ్మిదింటికల్లా గాఢంగా నిద్రపోవడానికీ సరిపోతుంది.

క్రిందటిసారి వచ్చినపుడు మూడురోజులు గడిపింది మనోరంజని కృష్ణవేణితో.ఆమూడు రోజులూ మనోరంజనిని ప్రక్కన పడుకోబెట్టు కుని హృదయానికి హత్తుకుంటూ మనో రంజని కబుర్లువింటూ, తాను ఎన్నో కబుర్లు చెపుతూ గడిపింది. ఆ మూడు రోజులూ ఎంత మధురంగా వున్నాయని ! భర్తతో తొలి రాత్రులు కూడా తనకంత ఆనందమివ్వలేదు. కృష్ణవేణి నడకలో మాటలో, ప్రతి పని

ఒసేవ్ అంటూ కేకలుపెట్టే భర్తని కుండాఅతనికి అన్నీ అందించుతుంది. రుచికరమైన మూడు నాలుగు ఆధర వులు చే తయారుచేసి,
పంపిస్తు
ప్రేమించే
చెయ్యదు. మనోరంజని

"అల్లా పిల్లేడుపుమనూ, నీ దగ్గర పడుకో వాలి నీతో ఎన్నో కబుర్లు చెప్పాలి. మాకు అల్లాంటి గొడవలేంలేవు. ఆయనేం అనుకోరు. నువ్వేం మాట్లాడకు." అంటూ బలవంతాన తన పక్కనే పడుకుంది. పైకి వద్దన్నా కృష్ణవేణి తన దగ్గిర పడుకోవడమే ఆమె

కిష్టం. ఆమె హృదయానికి హత్తుకుపోయి హాయి అనుభవించింది. ఆ మూడు రోజులూ అల్లాగే పడుకున్నారు. ఒకరోజు కృష్ణవేణి ది. "మనూ, ఆయనేమన్నారో తెలుసా ? ు నామీదకన్న మీ మనూ అంటేనే యిష్టం. ఆవిడ దూరంగా వుంటే ఆవిడని తల్చు కుంటూ, వస్తే ఆవిడని వదిలిపెట్టవు" అన్నారు.

"నిజమా" మనోరంజని కళ్ళు పెద్దవి చేసి చూసింది.

'ఊ... నిజమే. నీ ప్రేమ చూసి ఆయ ఆశ్చర్యపోతారు తెలుసా" అంది. జని ఆ మాటకి ఎంతో సంతోషిం

నెల్లాళ్ళు సెలవు పెట్టి నా దగ్గిరకి రాకూడదూ?"

"నెల్లాళ్లే ! నన్నువదిలి ఆయన ఒక్క రోజు కూడా వుండలేరు మనూ"

ఫక్కున నవ్వింది మనోరంజని. "చూశావా నీ మనస్సు? నిన్ను వదిలి ఆయనా వుండలేరు, ఆయన్ని నీవూ వదలివుండలేవు"

కృష్ణవేణి సిగ్గుపడింది. "నిజమేనోయ్. నాకు రెస్ట్ లేకనే. ఏవో యంత్రాల్లా పగ లంతా చాకిరీచేసి రాత్రిపడేసరికి అలసిపోతాం. మా ఇద్దరికీ మాట్లాడుకొనేందుకైనా ఓపిక వుండదు. ఆదివారం సెలవైనా వారం పొడు గునా మిగిలిపోయిన వర్క్ అంతా సరిచూచు కోవాలి. సెలవులు యిస్తే యిద్దరికీ ఒక్క సారే యిస్తారు. ఆ సెలవు వృధా పోకుండా ఎక్కడికైనా తిరిగి వస్తూ వుంటాము. అంతేకానీ..."

"ఎడబాయని జంట మీది అవునా ?" నవ్వింది మనూ. అందుకే ఎంత భార్యాభర్త లయినా కొంత ఎడబాటుకూడా అవసరం అంటాను. తాత్కాలికమైన ఎడబాటు భార్యా భర్తలమధ్య మమత పెంచి పునస్సమాగమో న్ముఖుల్ని చేస్తుంది. ఏదోవంకని పుట్టింటికి వెళ్లడానికి కూడా కుదరదు నీకు. ఏళ్లతరబడి మార్పు లేని జీవితం ఎవరికైనా విసుగే"

"అందుకే నీవు వస్తే మనస్సుకి పుత్సా హంగా వుంటుంది. మనూ. ఇంకో రెండు రోజులు వుండవూ"

"అల్లాగేలే" అంది మనూ

కాస్సేపటిలో నిద్రపట్టేసింది కృష్ణ వేణికి. నెమ్మదిగా ఆమెకి నిద్రాభంగం కలుగు తుందని లేచి తలగడా తీసుకుని క్రింద పడు కుంది మనూ.

మళ్లీ ఇవాళపగలంతా చాకిరీతోఅలసిపోయిన కృష్ణవేణికి పడుకోగానే నిద్ర పట్టేసింది. ఆమెతో కబుర్లు చెప్పాలనుకున్న మనోరంజ నికి ఏం చెయ్యాలో తోచలేదు. కృష్ణవేణిని

లోనూ ఒక ప్రత్యేకత, ఆకర్షణ వున్నాయి. మనోరంజని ఆమెనెంతగా ఆరాధిస్తుందంటే ఆమెని వదిలి వెళ్లాలంటే తన ప్రాణాలని ఎవరో బలవంతంగా లాగేస్తున్నట్లు బాధ వస్తుంది. కృష్ణవేణి సమక్షంలో ఆమెకిభర్త, పిల్లలు గుర్తుకురారు. ఆమె ప్రేమ ఎంత స్వార్థపూరితమైనదంటే కృష్ణవేణి కూడా తననంతగా ప్రేమించాలనీ భర్త పిల్లలసంగతి పట్టించుకోకుండా తనతోనే కాలం గడపాలనీ కోరుతుంది. ఆమె బాధ అల్లా ఉండగా కృష్ణవేణికి భర్త, పిల్లలే కాదు వుద్యోగం కూడా వుంది. తొమ్మిదింటికల్లా వంటభోజనం ముగించుకొని బస్‌కోసం క్యూలో నుంచోవాలి. పగలంతా మగవాడితో సమంగా ఆఫీసులో చాకిరీచేసి యింటికివచ్చి గృహిణిగా మారి పోతుంది. మనోరంజని అంటే ఆమెకి ప్రేమే. కాదనలేం. ఆమె వచ్చినప్పుడల్లా ఎంతో ఆదరిస్తుంది. తన ప్రాణంగా చూస్తుంది. కానీ తన విధ్యుక్త ధర్మ నిర్వహణలో కూడా లోపం రానియదు. ఇంట్లో వున్నంత సేపూ ఒక పక్క ఇంట్లో పనులు చేసుకుంటూ ఏమేవ్,

తెలుసు. తన సమక్షంలో శాం వచ్చే "మనూ"ని ప్రేమగా యానికి హతు రాత్రి తెల్ల ఉండే మ మేలుకుని క చెప్తే తెల్ల ం, డ్యూటీ కోవడం కష్టం. అయినా ఎంత ప్ర చినా ఆమెకి పగలంతా అలసివున్న రాత్రి తొమ్మిదిగంటలకల్లా కళ్ళు మ పడిపోతాయి. మనోరంజని బాధపడుతూ బలవంతాన విప్పినా మరుక్షణమే వాలిపోతే ఆ కనురెప ఆమె బ లేక "పడుకోకృష్ ఎందేక రంజనికి కోప ప్రయత్నం చేసినా మునిగిపోతోంది కృ కిందటిసారి "కృష్ణా, నాదగ్గిర పడు గారేమనుకుంటారో. నువ్వు ఆ గదిలో పడుకో. నే పడుకుంటాను." అంది.







ఎందుకో కృష్ణవేణి శారీరి మానసికంగానూ బాగా అలసి ంది. నిన్నరాత్రి తన ప్రక్కనే కళ్లనీళ్లు పెట్టుకుంది. లగా బతిమాలగా ఆఖరికి "నాకీ మీదే విరక్తి పుడుతూందోయ్ మనూ. బాగారి ఆశ్రమానికోపోయి ఈ ప్రాపం బంధాలకి దూరంగా వుండాలనిపిస్తుంది. ఈ సంసారంలో నాచేతలకి గుర్తింపు, మనస్సుకి శాంతి లేవు. వీటన్నింటికి దూరంగా కాలనిపిస్తూంది" అంది.

'కృష్ణా'...వులిక్కిపడింది మనోరంజని. అల్లా అనకు ఎప్పుడూ సంసారం అంటే సుఖంతో పాటు, కష్టాలనీ, బాధ్యతనీ కూడా భరించాలి. అయినా నీ కేం తక్కువని? రత్నాల్లాంటి యిద్దరు పిల్లలనీ నీ భర్తనీ వదిలి వుండగలవా? ఇద్దరూ సమానంగా సంపా స్తున్నారు. బాబాలని నమ్ముకుని నీ సంసారాన్ని నట్టేట్లో వదిలిపోతే నీకు యిహం,పరం కూడా వుండవు తెలిసిందా? ఈ సుఖమయమైన జీవితం అలవాటుపడిన దానివి ఎక్కడో లికోసం పరుగు పెడితే నీకు అది లభ్య పా. అల్లాంటి కబుర్లు చెప్పకు" గా.

ను బాబాల మీద నమ్మకం లేదా? ర్యంగా అడిగింది కృష్ణవేణి.

"బొత్తిగా లేదు. నాకు అల్లాంటివాళ్లని గుడ్డిగా నమ్మేవాళ్లంటే అసహ్యం. నీకు మనస్సుకి శాంతి కావాలంటే భగవంతుణ్ణి ధ్యానించుకో. నీకు పూజ, మంత్ర తంత్రాలు రాకపోయినా సరే భక్తి ప్రధానంగా తీసుకుని భగవంతుడు ముక్తినివ్వచ్చుకానీ బాబాలని నమ్ముకుని వెళ్లిన వాళ్లకి యిహం పరం రెండూ కూడా వుండవని నా నమ్మకం. భగవధ్యానంలోనే నీకు ప్రశాంతత లభ్యమవుతుంది. అయినా నీ మనస్సుకి, శరీరానికి తగినంత విశ్రాంతి లేక యిల్లాంటి ఆలోచనలు. ఓ

చూస్తూ అల్లా ఎంతసేపు గడపగలదుతను? లేస్తే బావుండును. నిన్న మొన్న నిద్ర లేక ఆమెకి నీరసంగా వుంది. ఇవాళ తను కూడా నిద్రపోతే బాగానే వుంటుంది. కానీ తెల్లవారి తను వెళ్లిపోవాలి. మళ్లీ ఎప్పుడో కలుసు కోవడం. రాత్రి "నేను దొడ్లోమంచం వేసుకు పడుకుంటాను కృష్ణా,నీవు లోపల పడుకో." అంది తను.

"దొడ్డిలో ఒకత్తివీ ఎల్లా పడుకుంటావు? అరుగుమీద మా అత్తగారు పడుకుంటారు. అక్కడ పడుకో" అంది. ఆ మాటకి తనకి కోపం వచ్చింది.

"అత్తగారి దగ్గిర పక్క వేసుకో" అంటే తనూ భర్తా పడుకుంటారనేగా.. సూటిగా, ఎంత స్పష్టంగా చెప్పింది. మొఖం పక్కకి తిప్పకుని "రోడ్డుమీద పడుకోవడం నాకలవాటు లేదు"అంది,

"అదేమిటి మనూ, నేనూ పడుకుంటానుగా నీ దగ్గర. లోపల వుక్క పోస్తూంది కదా అని అన్నాను ఉన్న ఒక్క ఫాన్ ఆయన వేసుకుంటారు. పోనీ మనం కూడా ఆ గదిలో నే పడుకుందాం."

"నాకు సిగ్గు బాబూ. ఫాన్ కోసమని ఆ గదిలోనే ఎల్లా పడుకుంటాం అన్నయ్యగారి ఎదురుగా"అని కొట్టివేసింది ఆమె మాటలని.

ప్రక్కగదిలో ఫాన్ తిరుగుతున్న చప్పుడు. ఉక్కపోస్తూన్నా మంచంమీద యిద్దరు పడుకోడం కష్టం. ఇంకో పక్కకి వత్తిగిలింది. మనస్సు అధికంగా ఆలోచించీ, నిద్రలేమితో అలసట చెంది నీరసానికితోడు సన్నగా గుండెలో నెప్పి మొదలయింది. గుండె దడదడలాడి పోతూంది. బాధ భరించలేక సన్నగా మూలగడం మొదలుపెట్టింది మనోరంజని. గుండె దడ, నొప్పి ఎక్కువయిపోతున్నాయి అంతకంతకు. దాహంతో గొంతెండిపోతూంది. తనింత బాధపడుతున్నాకృష్ణవేణికి మెలకువలేక

## రానిక నీకోసం సఖి

పోవడం చూసి కోపంకూడావచ్చింది మనోరంజనికి. గదిలో మంచినీళ్లుకూడా లేవు. భగవంతుడా, ఏం అవస్థ యిది. ఏ అరుగుమీదో పడుకున్నా తీరిపోను. తనే అవస్థ తెచ్చి పెట్టుకుంది. గట్టిగా మూలిగితే కృష్ణవేణి లేచిపోతుందేమో అని బిగపట్టుకున్నా బాధ ఆగడం లేదు. ఎంతోసేపటికి కృష్ణవేణికి హఠాత్తుగా మెలకువ వచ్చింది. గుండెలు పట్టుకుని బాధ పడిపోతూన్న మనోరంజనినిచూసి ఒక్క ఉదుటున లేచి కూర్చుంది. "మనూ... ఏమిటి ఎందుకు మూలుగుతున్నావు?" అని కంగారు పడిపోయింది చీరకొంగు ముఖానికి అడ్డు పెట్టుకుని యింతసేపూ భరిస్తూన్న బాధ ఒక్కసారి పెల్లుబికింది కృష్ణవేణి "ఏమైంది చెప్పమ్మా మనూ" అని అడగగా అడగగా ఆఖరికి "గుండెల్లో నెప్పి కృష్ణా... అప్పుడే చాలాసేపట్నించి బాధపడుతున్నాను" అంది మనూ.

"... లేపలేదు; అల్లా బాధ ఎంత ...న్నావో, వుండు. టర్పెం ...మర్దనా చేస్తా" అని అలమా ... వచి ... పడుకు... కి సీసా వం... గుం... ర్దనా చెయ్య... చేయి ...నే మనూ బా... లోని అ... నెమ్మదిగా తగ్గసా... చెయ్యి ... హత్తుకుని నె... ముద్దు పెట్టుకుంది "కృష్ణా ఎ... గొంతెండిపోతూంది కాసిని మంచి నీళ్లు...య్య" అంది. కృష్ణవేణి గబగబాలేచి వంటి...టి తలుపు తీసి మంచినీళ్లు కూజాలోంచి వంచి పంచదారవేసి తీసుకువచ్చి కొద్ది కొద్దిగా పట్టించింది. మనోరంజని గుటక వెయ్యలేక బాధపడుతూనే కొద్దిగా తాగి "ఇంక చాలు" అంది.

"తగ్గిందా నొప్పి" ఆదుర్దాగా అడిగింది కృష్ణవేణి మనోరంజని సందిగ్ధంలో పడింది. "ఏమని చెప్పాలి" తగ్గిందంటే మళ్లీ నిద్ర పోతుంది. లేదంటే మాత్రం ఎంతసేపు కూర్చుంటుంది విసుక్కోకుండా.

"ఇందాకటికన్న కొద్దిగా సర్దుకుంది. కానీ ఇంకా బాధగానే వుంది" అంది నీర్సంగా.

"తగ్గిపోతుందిలే. నిద్ర పట్టించుకో. ఈ మంచంమీద యిద్దరం పడుకుంటె యిరుగ్గా వుంటుంది. నేను కింద పడుకుంటాను. నీవు ఈ దిండు కూడా ఎత్తుగా పెట్టుకుని విశాలంగా పడుకో."

"అమ్మయ్యో అనుకున్నంతా అయింది. ఈ మంచం మీద నన్నొక్కత్తినే పడుకో మంటూంది." అనుకుని కంగారుగా "వద్దు... అదే సర్దుకుంటుంది. నువ్వేం కంగారుపడకు. నువ్విక్కడే పడుకో" అంది.

"మనూ ... వద్దు. నా మాట విను. ఇరుగ్గా పడుకుంటే గుండెల్లో నొప్పి మళ్లీ వస్తుంది. అసలు యీ గదిలో వద్దంటే వినవు. ఇందులో గాలిరాదు. ఫాన్ వున్న గదిలో పడుకుందామంటే సిగ్గు! అరుగుమీద భయం అంటావు. చెప్పినమాట వినవు. నాకసలు యిందులో వూపిరాడటంలేదు"

ఒక్కసారి లేచింది మనూ. కృష్ణవేణిని మంచంమీదకి లాగి కూర్చోపెట్టి ఆమె వళ్లో తల పెట్టుకుని పడుకుంది. కృష్ణవేణికి వళ్లంతా చెమటపోస్తూంది. "భగవంతుడా! చెప్పితే వినేరకం కాదు యిది." అనుకుంటూ లేచి నిల్చుంది.

"... పడుకో. నే... ...నువ్వు... ...ంది ... బాధ, ..., అవమ... గాపులగంగా వేధించాయి. "తనకీశాస్తి ... పిచ్చిగా కట్టిపడెయ్యాలనుకుం...ందా. పిచ్చి ప్రేమ వు... ...ష్ణవేణి కబుర్లు చెప్ప... ...ం చూసి, వస్తూన్న నిద్రని కునిఈబాధతెచ్చిపెట్టుకుంది. ఆ... లేపాలనుకుని అభాసుపాలయింది." అని యింకా బాధపడుతూ సన్నగా మూలుగుతూ దొర్లుతూ తనుకూడా కింద పడుకుని ఓ మూల దోమలుకుట్టి చంపేస్తూంటే "భగవంతుడా ఎంత నరకంగా వుందీరాత్రి." అని ఏడ్చింది.

ప్రక్క గదిలో మంచం చప్పుడు. గాజులు ఘల్లుమన్న సవ్వడి. మనోరంజని వూపిరి బిగపెట్టింది. ఎవరో తలుపుతేసి వస్తూన్న అడుగుల చప్పుడు. కళ్లు మూసుకుంది. సవ్వడి దగ్గరై తలుపులు వేసిన చప్పుడు మళ్లీ అడుగులు దూరమైపోయాయి.

"ఏయ్ .................... జాగ్రత్త"

ఆ గొంతు అతనిదే. సందేహంలేదు మళ్ళా ఏ మాటలూ వినిపించలేదు. నెమ్మదిగా శ్వాస వదిలింది మనోరంజని తలుపులు వేసినది కృష్ణే అయితే "కిందపడుకున్నావనైనా అడగ లేదు. అవును తనకేం పట్టింది." నిద్రనీ, సుఖాన్నీ దూరం చేసుకునే ఖర్మ తనకేం. హు...సంసారం...విరక్తిట.ఇప్పుడు ఎక్కడికి పోయిందో విరక్తి. భర్త సమక్షం విసుగు పుట్టి స్నేహితురాలు వుంటే బా వుం డు ననుకుంది. స్నేహితురాలి పిచ్చి ప్రేమ విసుగెత్తి భర్త కౌగిలిలో వరిగిపోయింది." మనోరంజని మనస్సు కా గి పో యిం ది. అయ్యిందా శాస్తి. స్నేహం. ప్రేమ అంటూ రావడం బుద్ధి తక్కువ. ఇం కె ప్పు డూ రాకూడదు వచ్చినా కృష్ణవేణి కావాలన్నా ఆమె దగ్గిర పడుకోకూడదు. అసలు రాకపోవడమే మంచిది. అని హెచ్చరించింది ఆమె మనస్సు. కాని బుద్ధిపక్షం అంతరాత్మ వాదాన్ని ఒప్పుకో లేదు. నీమీద నిజమైన ప్రేమ వుంది కృష్ణ వేణికి, నీలాగ తొందరపాటు, అవివేకం లేవు ఆమెకు. నీ మేలుకోరే వెళ్లిపోయింది. అని

పెటి ంది.

ఇంకెప్పుడూ ... ావచ్చి,

తను ... పడ

ుంచ

తెల్లవారి లేచి కృష్ణవేణి పనులు చూసుకుం టూంది. మనోరంజనికి చాలా నీర్సముగా వుంది. అయినా అల్లాగే తూలిపోతూ లేచి వెళ్లి ముఖం కడుక్కుంది. కృష్ణవేణి ఆమె దగ్గిరకి వచ్చి "మనూ... లేచావా కాఫీ తాగుదుగాని రా" అని పిలిచింది. మాట్లాడ కుండా ఆమె వెనుకే వెళ్లి కాఫీ తాగింది. "గుండెల్లో నెప్పి తగ్గిందా? ఎంత పీక్కు పోయిందో ముఖం! కళ్లు ఎర్రగా వాచి పోయాయి." అంది జాలిపడుతూ. "ఇంక తెమలాలి నేను. స్నానంచేసి వస్తా"నంటూ లేచింది మనూ. "ఎక్కడి? యివాళ వెళ్ల డానికి వీలులేదు. డాక్టరికి చూపిస్తాను. ఇంత నీరసంతో ఎల్లా వెళ్తావు?"

ఇక్కడా? వద్దు ఫరవాలేదు. వెళ్లిపో గలను. మళ్లీ తొమ్మిది అయితే నీకు ఆఫీసు టైమవుతుంది. అని గబగబా బాగ్‌లోంచి చీర తీసుకుని వెళ్లి స్నానంచేసి వచ్చేసింది — బాగ్ సర్దేసి తను తయారయిపోయింది. చేతిలో బాగ్ పట్టుకుని "వెళ్తాను కృష్ణా" అని గది గుమ్మంలో నుంచుని "... గారూ వెళ్తానండీ" అని చెప్పి బయటి

కృష్ణవేణి కళ్లు అశ్రుపూరి

...గ రికి ... "మనూ"

...

పడ్డావో. నీవింకా రెండు రోజులుంటావనటే నిజం అనుకున్నాను. నా మీద కోపమా ఎందుకు వెళ్లి పోతున్నావు?" అని అడిగింది.

మనోరంజనికి దుఃఖం ఆగలేదు. "లేదు కృష్ణా; నీవేం చేయలేదు. రాత్రి బాధ నేను తెచ్చిపెట్టుకున్నదే. నీవెంత ప్రేమగా చూసినా నీ ప్రేమ మరెవరికీ చెందకూడదను కోవడం స్వార్థంకాదూ. ఒక పక్క గృహిణిగా, మరో పక్క వుద్యోగినిగా రెట్టింపు బరువు, బాధ్యత మోస్తున్న నిన్ను నీ పనులన్నీ మాని నాతో తిరగాలనుకోవడం నా బుద్ధిహీనత. సాధ్య మైనంత వరకు నీ దగ్గరికివచ్చి నిన్ను బాధ పెట్టకూడదని నిశ్చయించుకున్నాను. వచ్చినా నీవు నన్ను వదిలి వుండడం నేను భరించలేను. వస్తాను కృష్ణా. సెలవు. మనం యిద్దరం వుత్తరాలతోనే తృప్తి పడడం మంచిది. నా గురించి బాధపడకు" అంటూ మెట్లు దిగి వెనక్కి చూడకుండా వెళ్లి పోతూన్న మనో రంజనిని అల్లా నిశ్చేష్టురాలై చూస్తూ నిల బడిపోయింది కృష్ణవేణి.

రానిక నీ కోసం సఖీ... రాదిక వసంత మాసం...పాట ఆమె చెవుల్లో ప్రతిధ్వనించ ...

సూరత్తు వేణుగోపాలరావు

# డైవోర్స్-70 నాటకం



పురుషోత్తం : ఏమిటా వెకిలి మాటలు? నా కలాంటి దగుల్బాజీ బుద్ధులు ఇంటా వంటా లేవు.

సావిత్రి : (వెటకారంగా) అవునవును ! నేనెప్పుడూ ఒక కంట కని పెట్టుకుని వున్నాను కాబట్టి ఇలా ఆగారుగాని కొంచెం ఏ మారా నంటే పూరుకునే రకమా ? ఆ పంతులమ్మ కనకం ఇంటికి పదే పదే పని కల్పించుకుని వెళ్లటం దేనికీ అంట.

నరహరి : (లౌక్యంగా) ఆ సంగతులన్నీ

*(గత సంచిక తరువాయి)*

ఇప్పుడెందుకులెండి ? కోర్టుకి వెళ్తున్నాం కాబట్టి ఇలాంటి దొకటి పెట్టుకోవాలి, పురుషోత్తంగారూ, మీరు కాస్త 'ఊ' అందురూ. గుట్టు చప్పుడు కాకుండా కథ నడిపించేస్తాను.

పురుషోత్తం : అంతకంటే గత్యంతరం లేకపోతే అలాగే కానివ్వండి.

నరహరి : అలాగన్నారు బాగుంది! విడా

(లోపల నుంచి అరుణ వస్తుంది.)

అరుణ : (నరహరిని వెక్కిరిస్తూ) విడాకులు, విడాకులు ! అమ్మా, ఏమిటా ఆకులు ?

సావిత్రి : అరుణా, నువ్వు లోపలికి వెళ్లు, పెద్దవాళ్లని ఎక్కిరించొద్దని ఎన్నిసార్లు చెప్పాలి ?

అరుణ : (దీనంగా) నాన్నగారూ నేనేమన్నా తప్పన్నానా ? విడాకులంటే ఏమిటి నాన్నగారూ ?

పురుషోత్తం : నీకు తర్వాత చెప్తానులే. వెంకటేసూ, అమ్మాయిని లోపలికి తీసికెళ్లు. (వెంకటేసు వచ్చి అరుణని తీసికెళ్లిపోతాడు.)

నరహరి : అందరూ మీలాగే ఒక నిర్ణయానికి టపీమని వచ్చేస్తే మా పని చాలా తేలికపడుతుంది. మీ ప్రక్కింటి పరంధామయ్య అలా కాదుగా ! నాన్చి నాన్చి, ఇదుగో అదుగో, అని తిప్పుతున్నాడు.

సావిత్రి : ఉండండి. విడాకులు తీసుకుంటే వేరుగా ఉండాలన్నారు. అదెలా సాధ్యం ?

నరహరి : ఓస్! అంతేనా? ఈ యిల

యిద్దరి పేరా ఉందికదా! మధ్యలో ఒక చిన్న గోడ పెట్టేస్తే సరిపోతుంది. కోర్టువారు అంతకంటే ఎక్కువ చూడరులెండి. ఈ విషయాలన్నీ నాకొదిలెయ్యి మంటున్నాగా... వస్తా!

(నరహరి వెళ్లిపోతాడు. వెంకటేసు ఆదుర్దాగా ప్రవేశం!)

వెంకటేసు : సావిత్రమ్మా, అరుణమ్మ చెప్పేది నిజమేనా?

సావిత్రి : (బింకంగా) ఏం చెప్పింది?

వెంకటేసు : ఇంకేం చెప్పాలి? ఇడాకులు తీసుకుంటున్నారంటగా! ఆస్తికోసం ఎంత పని కొడిగట్టావమ్మా! ఇది మనకి తగిన పని కాదు.

సావిత్రి : వెంకటేసూ, నువ్వెవరివో, నీ తాహతేమిటో మరిచిపోతున్నావు. నీకు సంబంధంలేని విషయాల్లో కల్పించుకోవటం ఏమీ బాగోలేదు. ఈ సంగతి మళ్లీ నా దగ్గర ఎత్తావంటే ఊరుకోను... (చాలా కోపంగా) పో, లోపలికి పో!

వెంకటేసు : నువ్వు చాలా మారిపోయావమ్మా. పొమ్మంటున్నావా? లోపలి కెందుకు, బయటికే పోతా! ముప్పయ్ ఏళ్లు నీకు సేవ చేసినందుకు ఎంత మాటన్నావు? పోనీలే, ఒకప్పుడైనా ఈ ముసలిపీనుగ చెప్పిన మాటలు గుర్తుకు రాక పోతయ్యా? (ఏదో జ్ఞప్తికి రాగా) అరుణమ్మా, నే వెళ్లిపోతుండా... అరుణమ్మా... (చాలా బాధగా) ... తల్లి. ఈ నాటితో నా ఋణం తీరిపోయిం...

...నుంచి వరుగె... ...స్తూ)

...తాత

...) ఆ

...స్తు...

## రెండో అంకం

[జడ్జీగారి ప్రైవేటు రూము మధ్యాహ... ...దాటింది. కోర్టు ప్రక్కనే వు... వెనుక ఒక కుర్చీ. ...కాలూ, వాలుగైదు పడివుంటాయి. ఇంకో ప్రక్క... ...ద జడ్జీగారు అప్పుడే భోంచేసిన పళ్లెం, గ్లాసూ, టిఫిన్ కారియరూ, వేరేవైపు. వేరేవైపున పుస్తకాల బీరువా. రెండు కుర్చీలు. కిటికీకి వెలిగి మాసిపోయిన కర్టెను. బీరువామీద టెలిఫోను. తెర తీస్తుంటే జడ్జి రంగనాథం చెయ్యి కడుక్కునివచ్చి, చిన్న టవల్‌తో తుడుచుకుంటూ కుర్చీలో కూర్చుంటాడు. కోర్టు బంట్రోతు సింహాచలం టిఫిన్ కేరియరూ, ప్లేటూ తీసుకుపోవటానికి వస్తాడు.]

సింహాచలం : అయ్యగోరూ, భోజనమైపోయి నట్టే గదండీ!

రంగనాథం : అయిపోయిందిలే. ఆ ప్లేటూ గట్రా తీసెయ్. ఇవాళ ఛేంబర్సులో డైవోర్సు కేసుంది.

సింహాచలం : అలాగేసార్! (కొంచెం ఆగి) ఇయ్యాళ మనింటో వంటాయన రాలేదుగదండీ. అందుకని వంటంతా అమ్మగారే స్వయంగా చేసారంట. కూరలు ఎలాగున్నాయో కనుక్కుని చెప్పరా, సింహాచలం అన్నారు.

రంగనాథం : నీ ముఖంలాగే ఉన్నాయి! వంకాయబజ్జీలో ఉప్పులేదు. ములక్కాయల సాంబారులో యింగువ గరళకంఠుడు మింగినా గజగజలాడి పోవలసిందే. ప్రక్కన అయ్యరు హోటలునుంచి ఏ యిడ్లీముక్కో తెప్పించుకుంటే సరిపోయేది.

సింహాచలం : (ఖాళీగా వున్న టిఫిన్ కారియరు ఊపుతూ) పాపం! అయ్యగోరే మీ భోంచేయలేదన్నమాట! అమ్మగారికి కూరలు బాగా లేవని చెప్పమంటారా?

రంగనాథం : (అదిరిపడి) ఆరే! అంతపని మాత్రం చెయ్యకు... అయినా, నీకెందుకీ అధిక ప్రసంగం? పోయి పార్టీలని పిల్చుకురా.

సింహాచలం : ఆ నరహరిగారి కేసాండి?

రంగనాథం : నరహరి కేసేమిటి, నీముఖం! సావిత్రమ్మ వెర్సస్ పురుషోత్తం. డైవోర్సు కేసు. భార్యాభర్తలు ఏ అరమరికలు లేకుండా చక్కగా కాపరం చెయ్యడానికి బదులు కోర్టులకి. ఎక్కడం ఏమిటి? ఇది మన సంస్కారానికే దెబ్బ! (మళ్లీ ఏదో జ్ఞాపకంరాగా) ఊరుకుంటున్నానుగదా అని ప్రతిదాంట్లో వున్నానంటావు! నోరుమూసుకొని పార్టీలని పిలు! (ఫైలు తీసుకుని కాగితాలు చూసుకుంటూ వుంటాడు. సింహాచలం తలుపు దగ్గిరకు వెళ్లి 'నరహరిగారూ' అని పిలుస్తాడు.)

నరహరి : (ప్రవేశిస్తూ) ... వున్నానులే! (రహస్యంగా) జడ్జీగారి ...లో వున్నారా? లేకపోతే యింక... అడుగుదాం.

...టలని ...డ తర్జనభర్జ... (నర... ఈ కేసు మీరే ...న్నారుగా! ...: (అతి వినయ... ...వునండి. సెషన్సులో మర్డరు... ...ధ్యాహ్నం కోర్టులో పదహారు ఎడల్టరీ కేసులు—

రంగనాథం : (అదిరిపడి) ఏమిటేమిటీ! పదహారు ఎడల్టరీ కేసులా?

నరహరి : (సర్దుకుని) అదేనండీ- ఎడల్టరేషన్ కేసులు. దేశంలో ఎక్కడ చూసినా కల్తీయేగా! బియ్యంలో రాళ్లు, గోధుమపిండిలో రంపపుపొట్టు, పెన్సిలిన్ గొట్టాల్లో మురికినీళ్లు... రామ రామ! నాకీ కేసులతోనే తీరుబడి లేక చస్తున్నానమ్మా అంటే, కాదూ, కూడదని సావిత్రమ్మ ప్రాధేయపడితే వచ్చాను... మీకూ చాలా ఫైలుంది కాబోలు! త్వరగానే ముగించేస్తానులెండి.

రంగనాథం : సింహాచలం, అలా బెల్లం కొట్టిన రాయిలా నిలబడిపోయావేం? పార్టీలని పిలవమంటుంటే —

సింహాచలం : సావిత్రమ్మా, పురుషోత్తం భార్య సావిత్రమ్మా! పురుషోత్తం! సావిత్రమ్మ భర్త పురుషోత్తం! ...

నరహరి : సింహాచలం, అంత గట్టిగా ఎందుకూ? ప్రపంచమంతా తెలియాలా?

(సావిత్రి, ఆమె వెనకాలే పురుషోత్తం వస్తారు.)

రంగనాథం : మీరు కూర్చోండి. (ఒక్క క్షణం ఫైలు చూసి సావిత్రమ్మతో) మీరు పెట్టుకున్న అర్జీ ప్రకారం చెప్పిన అంశాలు ఏమిటంటే— మీరు అగ్నిసాక్షిగా వివాహమాడిన పురుషోత్తం అనే వ్యక్తి - వయస్సు ముప్పైఐదు — చెడు సహవాసాలు చేసి, అహోరాత్రులూ క్లబ్బుల్లో పేకాటలాడుతూ, పైగా పరస్త్రీ వ్యామోహంలో పడిపోయి, అసలు ఇంటిముఖమే చూడటంలేదనీ, ఆడపాతడపా యింటికి వచ్చినా, మిమ్మల్ని నానా హింసలూ పెడుతున్నాడనీ, అందుచేత విడాకులు యిప్పించమని కోరుతున్నారు. ఇదంతా నిజమేనా?

సావిత్రి : (తల వూపుతూ) అక్షరాలా నిజమేనండి. ఇలాంటి దుర్భరమైన బ్రతుకు బ్రతికేకంటే, ఏ నూతిలోనో, గోతిలోనో దూకి జీవితమే చాలించుకుంటే మంచిదని అస్తమానం ఏడుస్తున్నానండి.

రంగనాథం : పురుషోత్తంగారూ, ఈ కేసులో మీరు ప్రతివాది. మరి మీతరఫున వాదించడానికి ఎవరూ లేరా?

పురుషోత్తం : నేనే చూసుకుంటానులెండి.

రంగనాథం : (నిర్ఘాంతపోయి) అదేమిటయ్యా? లాయరు లేకుండా మీరు వాదించగలరా? కేసంటే అల్లాటప్పా వ్యాపారమనుకుంటున్నారా? ఇందులో ఏమీ లాలూచీ లేదుకదా!

నరహరి : అబ్బెబ్బే! ఎంతమాటన్నారు? పాపం శమించుగాక! కోర్టులు మనం పూజించే దేవాలయాల్లాంటివి. అటువంటి పవిత్ర స్థలాల్లో లాలూచీచేస్తే పుట్టగతులుంటాయండి?

సింహాచలం : అబ్బో! మన కోర్టుల్లో ...గా నిజంతప్ప అబద్ధం చెప్పరు. ప్రమాణా...

...గనాథం : (చిరాగ్గా) నోర్ముయ్.

...రి : అబ్బెబ్బే! నేనేమీ అనలేదండి. నన్ను అపార్థం చేసుకుంటున్నారు.

రంగనాథం (విసుగ్గా) నేనన్నది విన్నుకాద ప్రక్కన లాయరు లేకుండా అసలైన న్యాయం ఎలా జరుగుతుంది! ఎన్నో కష్టమయిన లా పాయింట్లు వస్తాయి. అలాంటివన్నీ ప్రతివాది ఎలా నిభాయించుకొస్తాడో నాకు తెలియటంలేదు.

నరహరి : అన్నీ తెలిసిన తమబోంట్లే యిలా శలవిస్తే ఎలా? యిద్దరు పార్టీలు లాయరు ద్వారానే వాదించాలని ఎక్కడైనా రూలింగు ఉందా? వాది ప్రతివాదులు యిష్టమైతే లాయర్లని పెట్టుకుంటారు. లేకపోతే లేదు.

రంగనాథం : అదీ నిజమే! (టైము చూస్తూ నరహరితో) సరే, మీరు మొదలు పెట్టండి.

నరహరి : యువర్ ఆనర్ ... సావిత్రమ్మ పల్లెటూళ్లో జన్మించింది. ఆమె తల్లిదండ్రులు మంచి సంప్రదాయం కలవాళ్లు. ఒక్కగానొక్క బిడ్డకాబట్టి చాలా గారాబంగా పెరిగింది. అన్నెమూ పున్నెమూ తెలియని అమాయకురాలు. ఇక పురుషోత్తం అంటారా? పట్నవాసాల్లో పెరిగి అన్నీ చవిచూచిన రసికాగ్రేసర చక్రవర్తి. కాలేజీలో చదువుకొనేటప్పుడే నాటు బీరకాయలు అవలీలగా మింగేసేవాడనీ —

# డైవోర్స్ - '70

రంగనాథం : ఆర్డర్, ఆర్డర్! బీరకాయలు మింగడమేమిటి ? ఆర్గుమెంట్సులో అతిశయోక్తులకి తావులేదు.

నరహరి : అవేనండీ, బీరుబుడ్లు ... ఆ రోజుల్లో పురుషోత్తంగారిది కడుపా, గంగాళమా అని విద్యార్థిలోకమంతా నివ్వెరపోయేవారని చెప్పే క్లాసుమేట్సు ముగ్గురు యిప్పటికిప్పుడు వాఙ్మూలాలు ఇవ్వడానికి తయారుగా వున్నారు.

పురుషోత్తం : అ బ ద్ధ ం, అంతా పచ్చి అబద్ధం! ... కాలేజీలో వున్నప్పుడు నాకు బీరంటేనే పరమ అసహ్యం. ఒక్కసారి మా స్నేహితులు బలవంతంచేస్తే పుచ్చుకున్నమాట విజమే. అంత మాత్రాన గంగాళాలు ఊదేస్తానని అనటం ఏమాత్రం సవ్యంకాదు.

సావిత్రి : జడ్జీగారూ, అ ద ం తా వీరు నమ్మకండి. ఇప్పటికిప్పుడు మా యింటికివస్తే ఎన్ని ఖాళీబుడ్లు పడి దొర్లుతున్నయ్యో ప్రత్యక్షంగా చూపిస్తాను. సొసైటీలో ఫేషన్‌గా ఒకటో రెండో పెగ్గులు పుచ్చుకోవడం తప్పులేదు, కాని అహర్నిశలూ త్రాగి బుడ్లు దొర్లిస్తే ఏ భార్య వూరుకుంటుందండీ!

పురుషోత్తం : అసలు మాఆవిడ ఇంట్లోకి ఒక రానీయదండీ. (సావిత్రితో) ఏ రా తీసుకుని ఇంట్లో సాక్ష్యం మిటి ?

... గుర్తు... ఆర్డర్.

పురుషోత్తం : (కోపంగా) ఇప్పుడా సంగతులెందుకు ?

రంగనాథం : (కోపంగా) ఇ ది గో, మళ్లీ ఇంకొకసారి మధ్యలో వచ్చావంటే బాగుండదు. కోర్టనుకుంటున్నారా? ఇల్లనుకుంటున్నారా? (విసురుగా) నరహరిగారూ, మీరు తొందరగా ముగించండి. పైన బోలెడంత పని వుంది.

నరహరి : యువర్ ఆనర్, ఇందాక చెప్పిన ఆర్గుమెంట్సులో ప్రతివాది యొక్క మనస్తత్వం పూర్తిగా విశదీకరించాను. జులాయి, త్రాగుబోతు, జూదరియైన ఈ పురుషోత్తంతో సావిత్రమ్మ యింత కాలం ఎలాగో నెట్టుకొచ్చింది. అశుభమూ శుభమూ తెలియని వాళ్ల విట్టితల్లి అరుణకోసం ఏ అగచాట్లయినా పడాలనీ, జీవితమే ధారపోయాలనీ, నిశ్చయం చేసుకుంది. కాని పురుషోత్తం వూరుకుంటాడా ? ఆమెని దారుణంగా హింసించేస్తున్నాడు. ఎన్నోసార్లు తప్పత్రాగి అతి సుకుమారమైన ఆమె శరీరంమీద చెయ్యికూడా చేసుకున్నాడు.

పురుషోత్తం : చాలు చాల్లే! వకాల్తపుచ్చుకున్నందుకు యిష్టంవచ్చినట్లు వాగేస్తున్నావు!

నరహరి : చూశారా! చూశారా! యువర్ ఆనర్! ప్రతివాది ఎంతకైనా తెగించాడు. ఇటువంటి కిరాతకుడైన భర్తతో నేనింక కాపరం ... లేను ... చెయ్యను, చెయ్యను!!

... ధం : నువ్వు ...

టయ ...

... మరి ...

... త ...

... యువర్ ...

పురు... ద్య పానానికి
కాలేజీలో ... పుకునే రోజుల్లో ...
వుండేవా... వుగా కనబడే అమ్మా...
తిరిగేవా... ద్ధి పొందాడు.
వుండే లోటుపాటులు తెలియని సావి...
దండ్రులు పురుషోత్తం డబ్బు చూ...

కట్టబెట్టారు. వివాహమయిన తర్వాతనైనా సావిత్రమ్మ లాంటి పరమ సాధ్వియొక్క ప్రభావం వల్ల బాగుపడతాడనీ, పెద్దమనిషిగా మారుతాడనీ అనుకున్నారు. కాని వాళ్ల ఆశలు — పాపం! అడియాశలై పోయాయి.

రంగనాథం : సా వి త్ర మ్మా, మీ భర్త లోపాలు మీకు ముందుగానే తెలుసన్నమాట.

సావిత్రి : అయ్యయ్యో! ఇలాంటి విషయాలు ముందే తెలుస్తే వివాహం చేసుకుంటానా ? అసలు మా నాయన ఆ రంగనాథంగారికి యివ్వాలను కున్నారు. మా నాయన మాట విననందుకు బాగా శాస్తి అయింది.

రంగనాథం : (ఉలిక్కిపడి) ఏమిటేమిటీ ? రంగనాథమా ? నేనా! అయితే ఈ కేసు తీసుకోడానికి వీలులేదు.

నరహరి : జడ్జీగారు ఏదో తప్పు విన్నట్లున్నారు ? ఆయన వేరే రంగనాథం. జి. రంగనాథం. ఇప్పుడాయన...

... త్తం : అం ఎదుగ...
గ్యామివి — నువ్వేమైనా అవుతావు.

రంగనాథం : ఆఖరుసారి చెపుతున్నాను
... పసరంగా జోక్యం చేసుకుని
... గ్కారం క్రింద చర్య తీస

... రుషోత్తం : క్ష మి ం చ ...
పోయింది.

రంగనాథం : సావిత్రమ్మా, మీ ... వ్వం దంతా నిజమేనా ? తగిన సాక్ష్యం లేక అబద్ధపు పిటిషన్ దాఖలు చేశారని ఋజువైతే చాలా కష్టాల్లో పడతారు.

సావిత్రి : ప్రాణంమీదకి వస్తేకాని, ఏ భార్య భర్తని వదులుకోవాలనుకుంటుంది ? మన సంప్రదాయంలో ఉన్న నీతి నియమాలూ, వివాహబంధంలో వున్న పవిత్రతా, తెలిసికూడా ఇవాళ నేను కోర్టుకి రావలసి వచ్చిందంటే, నా హృదయం ఎంత క్షోభిస్తున్నదో భగవంతునికే తెలుసు. కాని గౌరవంగా తెగతెంపులు చేసుకోకపోతే ఏ ప్రమాదం వస్తుందో, ఎంతెంత ఘోరాలు జరగవచ్చో తమరే ఆలోచించండి. (ఏడుస్తూ) నా జీవితమెలాగూ నాశనమైపోయింది. ఆ ముక్కుపచ్చలారని బిడ్డ ముఖమైనా చూసి నాకు న్యాయం చేయమని అడుగుతున్నాను.

నరహరి : (జడ్జీతో) వాది స్త్రీ కాబట్టి

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777

**హెచ్చు [illegible] దనము, తక్కువ ఖ[illegible]**






సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శుభ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

ఒక క్రొత్త రకపు ఉతికే బార్‌ను వాడడము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్ !

shilpi hpma 6A/73 TEL

చెప్పవలసిన కొన్ని ముఖ్య విషయాలు తన నోటితో చెప్పటానికి సంకోచపడుతూ వుంది. గత వాలుగై దేళ్లగా ఆమెకు సంసార సుఖం అంటే ఏమిటో తెలియదని మనవి చేస్తున్నాను. పండువెన్నెలలాంటి ప్రాయంలో, తీరని కోరికలతో, అంతులేని నిరాశలో కృంగి కృశించిపోతోంది. దానిమీద పులిమీద పుట్రలా, భర్త పర స్త్రీ వ్యామోహంలో పడి అన్నంతా గుల్లచేయటమే కాకుండా హింసాపూరితంగా ప్రవర్తిస్తున్నాడు. కోర్టువారు ఈ సంగతులన్నీ సమగ్రంగా అవగాహన చేసుకుని సరైన ఆర్డరు జారీ చేయకపోతే విపరీతమైన పరిణామాలకి బాధ్యులౌతారు.

రంగనాథం : వాది తరఫున పిటిషన్ విన్నాను. ప్రతివాది చెప్పవలసిన దేమైనా వుందా ?

పురుషోత్తం : లేకేమండి? బోలెడంత వుంది. ఇదంతా పెద్ద నాటకం సార్ ! శుద్ధ అబద్ధం !

రంగనాథం : ఇది కోర్టని మీా కెన్నిసార్లు చెప్పాలి ? ఇక్కడ కొన్ని సభ్యతలు పాటించాలి.

పురుషోత్తం : యువరానరూ, నేను అబద్ధం చెప్పడం లేదండి. మా ఆవిడ వేసిన పిటిషన్లో చాలా అవకతవకలూ, అబద్ధాలూ ఉన్నాయనే మనవి చేసుకుంటున్నానండి. నన్ను త్రాగుబోతన్నారు. ఈ రోజుల్లో తాగనివాళ్లెవరు సార్ ? అది లేకుండా ఒక్క పనైనా జరుగుతుందా చెప్పండి. పగలంతా ఆఫీసుల్లో పనిచేసి అలిసి సొలసిపోయే పెద్ద పెద్ద అధికారులూ, లక్షలార్జించే పారిశ్రామిక వేత్తలూ, గ్రామ గ్రామాలూ పర్యటనలు చేసి గుక్క తిప్పుకోకుండా ఉపన్యాసాలిచ్చే రాజకీయ దురంధరులూ, చివరకి గౌరవనీయులైన న్యాయమూర్తులు సాయంత్రం ఒకటో రెండో చుక్కలు వే... మర్నాటికి మళ్లీ తేరుకోలేరు. తమరుకూడ

రంగనాథం : ఏమండోయ్...

పురుషోత్తం : క్షమించండి. ఏ... టవరసకి ...నబోయాను గాని తమవంటి పెద్దవాళ్లకీ చెడ్డ అలవాట్లుంటాయా ?

రంగనాథం : సరే, కానీయవయ్యా —

పురుషోత్తం : అయ్యా, నేను మా గ్రామం గొల్లపాలెంలో ప్రశాంతంగా జీవించాలనీ, దాన్ని సర్వతోముఖంగా వృద్ధిలోకి తేవాలనీ సంకల్పించుకున్నాను. కాని పెళ్లయి పట్టుమని పదిరోజులు కాకుండానే మాఆవిడ పల్లెటూర్లో కాపరమేమిటని పట్నవాసంలో మకాం పెట్టించింది. దాంతో ఊరుకుందా ? అన్ని క్లబ్బుల్లోనూ మనమే వుండాలనీ, పెద్ద పెద్ద ఉద్యోగస్తులందరితో పూసుకు పూసుకు తిరగాలనీ గోలచేసేసింది. పగలూ రాత్రీ అనే భేదం లేకుండా పాయింటు రూపాయిపెట్టి పోకరురమ్మీ ఆడుతుందండీ ... ఏమన్నా అంటే సినిమాలో సూర్యకాంతమే అనుకోండి ! ఏం చెప్పమంటారు నా బాధలు ?

సావిత్రి : నేను రమ్మీ ఆడినంత మాత్రాన అంత ఉడుకుమోతుతనం ఎందుకు ? సర్వవేళలూ వంటింట్లో చాకిరీ చేసుకుంటూ పడివుండటానికిది పురాణకాలం కాదు.

రంగనాథం : నాకు తెలియక అడుగుతాను— ఆడవాళ్లకి ఇల్లు ముఖ్యమా, క్లబ్బు ముఖ్యమా ?

# డైవోర్స్ – '70

సంసారమన్న తర్వాత, కొంచెం భర్తనికూడా గమనించుకోవద్దూ ?

సావిత్రి : ఆహా ! క్లబ్బులో రమ్మీ ఆడేది నేనొక్కదాన్నేనా ? కలెక్టరుగారి భార్య, మూవ రెంటుగారి సతీమణి, మీాఆవిడ —

రంగనాథం : అదిగో ! ఏమో అనుకున్నాను... నరహరిగారూ, మీ క్లయింటుని కొంచెం అదుపులో పెట్టుకోండి...

నరహరి : (గబుక్కున) కోర్టువారు మమ్మల్ని క్షమించాలి. మీఆవిడ సంగతులు యిక్కడికి రానీయమని హామీ యిస్తున్నాను.

పురుషోత్తం : (మధ్యలో అందుకుని) మా ఆవిడ —

రంగనాథం : (సరిగా వినకుండా, కోపంగా) మళ్లీ అదే మాట !

పురుషోత్తం : మీా ఆవిడ కాదండి... మా ఆవిడ... ఇవాళ ప్రత్యేకంగా కోర్టువారిని నమ్మించేందుకు మహా పతివ్రతా వేషం ధరించి, బిడి బిడి రాగాలతో, కల్లబొల్లి మాటలతో మీా కళ్లలో — అంటే న్యాయం కళ్లల్లో కారం జల్లటానికి బ్రహ్మాండమైన పన్నాగం వేసింది... మా ఆవిడ కనపడుతు... అమాయకురాలు కాదండోయి. అహ... ...తాయించుకు తింటూ ఇల్లొక

...మే, కొంతమంది భార్యలు

... తుం...

...) హ...

...గ్లాడకూడదూ

ను... ...డినా నాకు క...

దంట ... మ రామ ! నేనలా

ఫోను ఎం... చేసినట్టు? కేసు మధ్య...

ములక్కా... ...ంబారేనా ? బాగానే

కొంచెం ... ఎక్కువైన దనిపించిం

ఎందుకంత కోపం ? ఆ మాత్రం క

కూడదా ఏమిటి ? అను...నదానికీ, కానిదానికి నువ్వలా తప్పు పట్టుకుంటే ఎలా ? సరే, ఇంకెప్పుడూ అనములే. (ఫోను పెట్టేసి దిగాలుగా కూలబడిపోతాడు).

నరహరి : అయ్యా, కాలుజారితే తీసుకోవచ్చు కాని, మాట జారితే —

రంగనాథం : (తను కోర్టులో ఉన్న సంగతి మర్చిపోయి) చక్కగా చెప్పేవు. మా ఆవిడ— (నాలుక కొరుక్కుని) మీా కేసు కానియ్యండి.

(టెలిఫోను మళ్లీ మ్రోగింది. ఎవరూ ఎత్తకపోతే రెండు మూడుసార్లు కొట్టుకుని మళ్లీ ఆగిపోతుంది.)

సింహాచలం : అయ్యా, ఫోనుచేసేది అమ్మగారేలాగుంది. గబుక్కున తమరు తీసుకోలేదని కోపంవచ్చిపెట్టేశారుకాబోలు.కొంచెం గమనించండి.

రంగనాథం : (చిరాకుగా) వస్తేరానీ ఎవరికి లెక్క. అయినా నీకెందుకీ సంగతులు? నోర్ముయ్ !

నరహరి : అయ్యా, మీారు కొంచెం కలవరంగా వున్నారు. తమకి ఏదన్నా యిబ్బందివుంటే కేసు వాయిదా వేసుకుందాం.

పురుషోత్తం : చాలు చాల్లే ! వాయిదాల పేరు చెప్పి మాఆవిడ దగ్గిరనుంచి పేకా గుంజుకోడానికా ? ... జడ్జీగారూ, గోటితో పోయేదానికి గొడ్డలి ఎందుకండి. నేను ఒప్పేసుకున్నానుగా ! ఆర్డరు పడేస్తే మాదారిన మేము పోతాం. (అని లేచి పోబోతాడు.)

రంగనాథం : (తేరుకుని) పురుషోత్తంగారూ మాదారిన పోతాం అని చులాగ్గా అనేస్తే సరిపోతుందటండి ? వివాహం మన ధర్మశాస్త్ర ప్రకారం ఎంతో పవిత్రమైన బంధం. అగ్నిసాక్షిగా పెండ్లాడిన భార్యాభర్తలు జీవితపర్యంతం కష్టసుఖాల్లో కలిమిలేముల్లో ఒకటిగా వుండాలని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అటువంటి పవిత్ర బంధాన్ని ఒక్కముక్కతో తెంపేసిపారెయ్యడానికి ఇది అమెరికా కాదు — ఫ్రాన్సూ కాదు. మన పుణ్య భారతదేశంలో — (ఫోను మళ్లీ మ్రోగుతుంది. తొందరగా దాన్ని అందుకుని, ఆదుర్దాగా) నాకు తెలుసు. నీకు ముక్కుమీాదే కోపంగాని మంచి మనసు. నేనుమాత్రం ఏమన్నాను ? (దిగాలుపడిపోయి) అరే ! తమరా ? మీారనుకోలేదు సార్. మా ఆవిడనుకున్నాను ... తమరు రోటరీ క్లబ్బులో ఉపన్యాసమిస్తుంటే ఎలా రాకుండ వుంటాను సార్. సాయంత్రం ఆరింటికేగా ? తప్పకుండా నా స్నేహితులతోపాటు వస్తాను. నమస్కారం. (ఫోను పెట్టేసి) మా ఆవిడ అనుకున్నాను. ఇం... పెద్ద జడ్జీ గారు. ఏమనుకున్నారో

...ం : పెద్ద...

లెం... ...లు లేని

...లు

...న్నే తీర్చ...

...న ఉపన్యాసం వినడానికి రమ్మని జడ్జీగారి ...

నరహరి : ఉద్ధతుల మధ్య పే ద కు

అన్నారు. అసలు ఆడవాళ...

...ండి !

...త్రి : (ఉపన్యాస ధోర...

... కానిదానికీ మామీాద విరు...

వారికి అలవాటైపోయింది. శతాబ్ద... ...

అధోగతిలో పడేసి పురుషుడికి చాకిరీచే... బానిసగానో అడిగినప్పుడల్లా కోరిక తీర్చే ఆటబొమ్మగానో చేసివేశారు. స్త్రీకి కూడా పురుషుడితోపాటు సరిసమానంగా జీవించటానికి సర్వహక్కులూ వున్నాయని ప్రపంచమంతటా ఒక మహోద్యమం రేగింది. మన శాస్త్రాలు కూడా స్త్రీ అంటే పరాశక్తి అని చెపుతున్నాయి. ఈ ఉద్యమాన్ని అవరోధించటానికి మీాకేకాదు మిమ్మల్ని పుట్టించిన బ్రహ్మదేవుడికే తరంకాదు.

రంగనాథం : ఆర్డర్, ఆర్డర్, నరహరిగారూ, మీా క్లయింటు నిజంగా పరాశక్తిలాగే వుంది !

నరహరి : కోర్టువారు మమ్మల్ని క్షమించాలి. సావిత్రమ్మా, యిష్టంవచ్చినట్లు మాట్లాడడానికి యిది మీా ఇల్లుకాదని జ్ఞాపకం పెట్టుకోండి.

పురుషోత్తం : అలా బుద్ధి చెప్పండి. పురుషుల మీాద ఉపన్యాసాలు దంచటానికి ఇది మహిళా సభ కాదనికూడా చెప్పండి.

(ఇంకా వుంది)

# సినిమా

## జేబుదొంగ కొలువులో అష్టదిగ్గజాలు

ఆనాడు కృష్ణదేవరాయల కొలువులో అష్ట దిగ్గజాలు వుండి అందాన్ని, ఆనందాన్ని తీసు కొచ్చారు. ఈనాడు సమత్ ఆర్ట్స్ వారి ''జేబు దొంగ'' చిత్రానికి అష్టదిగ్గజాలు వుండి, శోభను చేకూరుస్తున్నారు.

ఆ దిగ్గజాలు ఎవరన. విక్టరీ మధుసూదన రావు, వెంకటరత్నం, చక్రవర్తి, ముళ్ళపూడి, ఆచార్య ఆత్రేయ, హీరాలాల్, అంకిరెడ్డి, కుదర వల్లి వరుసగా దర్శకత్వాన్ని, ఛాయాగ్రహణాన్ని, సంగీతాన్ని, మాటల రచనను, పాటల సృష్టిని, నృత్యాన్ని, కూర్పును, కళను నిర్వహిస్తున్నారు. వీరందరూ ఆయా శాఖలలో నిష్ణాతులు.

గ్లామర్ జంటగా ప్రజలచేత కొనియాడబడు తున్న శోభన్, మంజుల ''జేబుదొంగ'' చిత్రంలో చేసే అల్లరి, జరిపే ప్రేమయానం, ప్రేక్షకులను విశేషంగా ఆకర్షిస్తుంది. ఈ చిత్రంలోని ముఖ్య పాత్రలను సత్యనారాయణ, రాజబాబు, రావుగోపాల రావు, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, రమా ప్రభ, కృష్ణకుమారి, రోజారమణి, మురళీ మోహన్ పోషిస్తున్నారు.

ర్వజనరంజకమైన కథను చటర్జీ రాశారు. ,యాచేంద్ర. లక్ష్మీ ఫిలింస్ విడుదల.

ల్లి !

ర

న

న

యులు

రు.

చిత్రం పూర్తయిన తరువాత, అక్కడి

న్ని అడిగాను. కథలో నూతన

తాతినేని రామారావు

ఏకగ్రీవంగా ఆమె

బాబు అద్భుతంగా చేశాడని

శారద గొప్పగా చేసిందని చెప్పారు. చ...వు సంగీతానికి, కన్నప్ప ఛాయాగ్రహ ణానికి, గొల్లపూడి కథకు అందరూ ఓటు వేశారు.

ఈమధ్య వస్తున్న చిత్రా లన్నిటికన్నా మిన్నగా వున్నదని చెప్పడానికి గల కారణాన్ని సినిమా చూచిన వ్యక్తులను అడిగాను. కథలో బిగువు, కథలో ట్విస్టు, కథలో పవిత్రత వున్నదని వెల్లడించారు. ఇంత మంచి చిత్రాన్ని నిర్మించిన పూర్ణచంద్ర రావును అందరూ అభినందించారు.

## నూరేళ్ళపంట

పంచరత్న ఆర్ట్ ప్రొడక్షన్స్ అనెడి కొత్త సంస్థ స్వర్గీయ కోదండపాణి యింట వెలసింది. ఈ సంస్థను బొబ్బిలి వాస్తవ్యుడు వి.ఎస్.ఎన్. రెడ్డి స్థాపించారు. ఉత్సాహవంతుడైన, అభ్యుదయ భావాలు గొన్న బి. ఎస్. వానుకు దర్శకత్వాన్ని అప్పగించారు. ఈతడు పి. చంద్రశేఖరరెడ్డి వద్ద వరుసగా తొమ్మిది చిత్రాలకు సహాయకుడిగా పని చేశాడు.

చిత్రం పేరు ''నూరేళ్ళపంట'' అని తెలి



''కొత్తకాపురం''లో కృష్ణ, భారతి

సింది. గ్రామీణ వాతావరణానికి చెందిన చిక్కటి కథ అని దర్శకుడు చెప్పారు. లో సత్య నారాయణ, పద్మనాభం, ర్య లాంటి అనుభవజ్ఞులు వుంటా నాయికా నాయకుల పాత్రలో

ం శాన్ని

నిర్మించబడే త్రానికి

న్ను, లాల్ ఛాయ న్ని నిర్వ

తెలుస్తోంది.

ం కం !

నాటకానికి ప్రజలలో పలుకుబడి ం. ఎన్నిసార్లు చూచినా తనివితీరదు. ఇట్టి నాటకంలో సారస్యమైన ఘట్టమగు తారా–

''చిల్లర దేవుళ్ళ''లో నూతన నటుడు ఏ. రామకృష్ణారావు



చంద్రుల సరసాన్ని లలితా మూవీస్ వారు తమ ''చల్లనితల్లి'' చిత్రంలో బాలే రూపంలో యిమిద్చారు.

జానపద గేయరాజుగా పేరు బడసిన కొసరాజు ''తారాశశాంకం'' బాలేను రచించారు. అదేమన:

తార : రావేలరా, చంద్ర బిగువేలరా
నీ వగలింక చాలించి నను చేరరా
: సరసాలతో నన్ను కవ్వించకు
ఇది ఎవరైనా వింటే నవ్వేరులే.

ను రామకృష్ణ, సుశీల మధుర మధురంగా పా సంగీత నిధి రాజేశ్వరరావు సమకూర్చిన పంగీ ని గూర్చి ఏమని వ్రాసేది ?

ఈ స్టేజి నాటికలో తారగా కొత్త సుమిత్ర, చంద్రుడుగా కొత్త నటుడు విజయ కాంత్ నటించారు.

''చల్లని తల్లి'' కథను ప్రముఖ నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు రాశారు. ప్రజా హృద యాలకు వచ్చే అన్ని అంశాలు ఈ కథలో వున్నాయి. చిరంజీవి. జగదీష్‌చంద్రప్రసాద్ నిర్మించే యీ చిత్రానికి కె. ఎస్. రామిరెడ్డి దర్శకుడు.

## రాఘవ చూపిన దారి !

విషయం తెలిసిన వ్యక్తులకు మంచి దారి చూపించడంలో రాఘవ ప్రథముడు. పరిశ్రమలో యిరవై అయిదేండ్లు దర్శకత్వ శాఖలో, ఎడిటిం గులో అనుభవం వున్న నెల్లూరు శ్రీనివాసరావుకు (శీనయ్య) రాఘవ తను తీయనున్న మరొక చిత్రానికి దర్శకుడిగా నియమించారు.

## మూడు చిత్రాల హీరో !

సంచలన నిర్మాత రాఘవ నిర్మించనున్న తదు పరి మూడు చిత్రాలలో హీరోగా నటించే ఛాన్సు రంగనాథ్‌కు దక్కింది. రంగనాథ్‌కు ఉజ్వల భవి ష్యత్తు వున్నదన్న నమ్మకం రాఘవకు వున్నది. దూర దృష్టి గల మనిషి రాఘవ అనుకున్నాడంటే, అది జరగాల్సిందే.



"ఆడదాని అదృష్టం"లో జయమాలిని, ...

## "చదువు - సంస్కారం"!

ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ రంగుల్లో నిర్మించిన మూడవ నీతిదాయకమైన చిత్రం "చదువు–సంస్కారం". మనిషికి చదువు నేర్చుకుంటే వస్తుంది. కానీ సంస్కారం జన్మతా రావాలి.

చదువుకొన్న ప్రతివాడు సంస్కారవంతుడను కోవడం పొరపాటు. అలాగే సంస్కారవంతుడయిన ప్రతివాడు చదువరిగా వుండనవసరంలేదు. ఈ రెండూ వున్న వ్యక్తులు గొప్పవాళ్లవుతారు. గొప్ప పనులు చేస్తారు.

నిశ్చయించినట్టు, ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడ ... రాజ రాసువ చెప్పారు. దీనికికూడా రాజ బాధ్యతలను [కథ, మాట సినిమా ...త్వం]

**విధి**

"కా... కానీ చేతుల... దుస్సాధ్యము."—వంగ రచ కలం పట్టిన రచయిత కథ

# సినిమా

## 1975 ఎలా వుంటుంది?

1974 లో విడుదలైన చిత్రాలను పరిశీలిస్తే, పరాజయం పొందిన సంఖ్య అధికంగా అగుపిస్తుంది. నిర్మాతలలో పదిశాతం లబ్దిని పొందారు. పదహారు శాతం పెట్టుబడిని పొందగలిగారు. మిగతా వాళ్లకు నష్టం వచ్చింది.

చిత్రాలను కొనుగోలుచేసేవాళ్ళు ఎక్కువగా వచ్చారు. ఎక్కువ రేటు ఇచ్చి చిత్రాలను కొన్నారు. అలా కొన్నవాళ్లలో మూడు శాతం మాత్రం కొంత లాభాన్ని ఆర్జించగలిగారు. ఎవరు నష్టం అనుభవించినా, అది పరిశ్రమకు వర్తిస్తుంది. కొని నష్టపోయినవాడు మళ్లీ కొనడానికి వస్తాడా?

1975 లో కూడా చిత్రాల సంఖ్య ఎక్కువవుంటుంది. కలర్ చిత్రాలు మరిన్ని వస్తాయి. ప్రతిఫలం వస్తుందో, రాదో చెప్పలే ...మణ ఖర్చు కనిపిస్తున్నది.

### నవలలు!

... రచయితలు సినిమాకోసం రచనలు సాగిస్తున్న సత్యాన్ని ఎవరూ కాదనలేరు. వారు రాసే కథలలో సిమిలారిటీస్ ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఒకేరకం కథలను, వేర్వేరు రచయితలు వారి వారి ధోరవడిలో వ్రాస్తున్నారు. అందువల్ల, నవలా రచనలో నావల్టీ పోతున్నది.

హీరోల అజమాయిషీకింద చిత్ర నిర్మాణం జరిగే దురదృష్టపు రోజులివి. డబ్బుపెట్టే మనిషికి విలువ తగ్గుతున్న రోజులివి. ప్రతిభకు మించిన రేటును డిమాండ్ చేస్తున్న రోజులివి. కలర్ తప్ప మరొకదానికి మొగ్గని రోజులివి. వారానికి రెండు ...తాల చొప్పున విడుదలవుతున్న రోజులివి. దర్శకు...కి తెలిసినది తక్కువ, తమకు తెలిసినది ఎక్కువ అని అర్టిస్టులు అలక్ష్యంచేసే రోజులివి.

ఇన్ని అవస్థలకు గురి అవుతున్న చిత్ర పరిశ్రమ '75 లో క్షేమంగా వుండగలదా?

### నిరాశ నిస్పృహలు

ప్రేక్షకులు పరిశ్రమవాసులందరికన్నా తెలివైన వాడవడంచేత, వచ్చే ప్రతి చెత్త చిత్రాన్ని నలేకపోతున్నారు. అతి సున్నితమైన ...ను కూడా ప్రేక్షకులు పసిగట్టి, తప్పుల ...యారు చేస్తున్నారు. నచ్చిన చిత్రాన్ని ...మూడడానికి అలవాటు చేసుకొన్న ప్రేక్ష... తమకు నచ్చనివాటిని శపిస్తున్నారు.



"చదువు–సంస్కారం"లో రంగనాథ్, సునంద

సంఖ్య తగ్గడంలేదు. రోజుకొక కొత్త సంస్థ పుడుతున్నది. పరిశ్రమలో ప్రతి మనిషికి చేతినిండా పని వుంటున్నది. ఇన్ని జరిగినా, నిరాశ నిస్పృహలే జయిస్తున్నాయి.

### కొత్త కాపురంలో కృష్ణ వేషం

ప్రసన్నలక్ష్మి పిక్చర్స్ వారి "కొత్త కాపురం" చిత్రం ఫిబ్రవరి 'యిరవై ఒకటిన విడుదల అవుతుందని, నిర్మాత వెంకటరత్నం తెలియచేశారు. ఈ చిత్రానికి పి. చంద్రశేఖరరెడ్డి దర్శకుడు.

గ్రామీణ కుటుంబానికి చెందిన విండైన కథను గొన్న "కొత్త కాపురం" చిత్రంలో కృష్ణ వేషంలో విశిష్టత వున్నది. పాలేరుగా, ఒక కుటుంబంయొక్క బరువు, బాధ్యతలను భరించే వ్యక్తిగా, మంచిని పెంచే మనిషిగా కృష్ణ నటించారు. గ్రామాభ్యుదయం ఆశించిన నిస్వార్థపరుడిగా కృష్ణ అపూర్వంగా నటించారు. పహాయ పాత్రలను గుమ్మడి, భారతి, కృష్ణకుమారి, అనిత, చంద్రమోహన్, పద్మనాభం, రమాప్రభ, అల్లురామలింగయ్య, హేమలత, రాజబాల పోషించారు.

ఈ చిత్రానికి బొల్లిముంత రచనను, మహాదేవన్ సంగీతాన్ని, లక్ష్మణగోరే ఛాయను నిర్వహించారు.

నిర్మాత ఓపికను ప్రశంసించాలి. చిత్రం ప్రారంభించిన నాటినుండి పూర్తయ్యేవరకు, ఆయన ఎదుర్కొన్న సమస్యలను మరొకరయితే సహించ లేరేమో అనిపిస్తుంది. హీరో కృష్ణ, మద్దతు,

''చదువు — సంస్కారం'' అనేది రెండు అమూల్యమైన సమస్యలపై ఒక చిక్కటి చక్కటి కథను అల్లాడు కథకుడు రాజశ్రీ. అట్టి గట్టి కథకు తనే మాటలను కట్టాడు. తనే దర్శకత్వం వహించాడు గాబట్టే తను వూహించిన పద్ధతిలో చిత్రాన్ని రూపొందించగలిగాడు.

''తాత—మనవడు, సంసారం- సాగరం'' వంటి మంచి చిత్రాలను నిర్మించిన రాఘవ అందిస్తున్న ఆణిముత్యం ''చదువు — సంస్కారం''. ఇందులో గుమ్మడి, సత్యనారాయణ, రంగనాథ్, గిరిబాబు, శుభ, మాలతి, మమత, మంజుభార్గవి, చిట్టిబాబు ముఖ్య పాత్రలను పోషించారు. కథానాయికగా కొత్త నటి సునంద భార్గవి నటించింది.

పవిత్రత వుండే చిత్రాలను ఆశించే ప్రేక్షకులను అట్టే ఆకర్షించగల శక్తి ''చదువు — సంస్కారం'' చిత్రానికి వున్నది. రాజశ్రీకి దర్శకుడి పీఠం బలపడుతుంది

**"మనుష్యులు - మనస్తత్వాలు" !**

''చదువు — సంస్కారం'' చిత్రం జనవరి యిరవై మూడున విడుదలవుతుంది. రిపబ్లిక్ డే నాడు తన నాలగవ చిత్రము ''మనుష్యులు — మనస్తత్వాలు'' కు ఆఫీసులో పూజ జరపడానికి

''భారతి''లో పద్మనాభం, లత



పోయుచున్న ... ఒక విచిత్ర క... వ్రాయగలదన్న నిజాన్ని ఎవరూ

''ఇక్కడ ర...

కథా...

లేదన్న ...

తలపడిం...

మాడింది. ... మంచితన...

ఎదుర్కొన్నాడు. ...రులెత్తిన ...నవ్వింది. విషపుగోళ్లతో రక్కింది. ఆ సుందెనిబ్బరం కోల్పోలేదు. ధైర్యంగా సాగేందుకు నిశ్చయించుకొన్నాడు.

రెచ్చిపోయిన విధి నూరుకొంటుందా దట్టి సవాల్ చేసింది. ఒక అనూహ...పులో అదునుచూసి ... పాతాళా... ఈసారికూడా మ... పోట్లే... ఢీకొన్నట్టు ఢీకొ...

ఆ పోరాట...

ఆఖరివరకూ నిలిచా...

'మంచిమనిషి...

అర్థాన్ని, జీవిత...

జేయు దైవాడు.

ఆ మహావ్యక్తి జీవిత చిత్రణమే తండ్రి'' వర్ణ చిత్రం.

చిత్ర విజయానికి తారాబలం ముఖ్యమ కథాబలం ముఖ్యమా ? యిది ప్రశ్న !

తారాబలం శారీరక సౌందర్యమైతే కథాబల ఆత్మసౌందర్య మౌతుం.

ఈ ప్రశ్నోత్తరాల ...

రూపొందించబడిన చిత్రం రామయతం...

కౌముదీ పిక్చర్స్ పతాకంక్రింద రూ... బడిన ఈ చిత్రంలో సత్యనారాయణ, ర... రాజబాబు, ముక్కామల, లక్ష్మీకాంత్, ... రావు, జయంతి, ప్రభ, పండ... కుమారి, అపర్ణ, మాస్టర్ ర..., మాస్టర్ రమేష్ ... ప్రభృతులు నటించారు. చిత్రానువాదం, మాటలు, పాటలు మల్లెమాల, సంగీతం సత్యం, కెమెరా కె. ఎస్. ప్రసాద్, దర్శకత్వం బి. వి. ప్రసాద్, నిర్మాత యం. యస్. రెడ్డి.

ఈ ప్రజారంజకమైన చిత్రాన్ని విజయా పిక్చర్స్ వారు ఆంధ్ర, సీడెడ్‌లోనూ, శ్రీ నేషనల్ ఆర్ట్ పిక్చర్స్ వారు నైజాంలోనూ, 'సుధా చిత్ర' వారు మైసూర్‌లోనూ జనవరి 14 వ తేదీన విడుదల చేస్తారు.



''పరివర్తన''లో కృష్ణంరాజు, లక్ష్మి

ఒకప్రక్క చిత్రాలు దెబ్బతింటున్నాయి. ఒక ప్రక్క కార్మికుల సమ్మె బెదిరింపులు వినిపిస్తున్నాయి. ఒకప్రక్క ఆర్టిస్టులు పెట్టే యిబ్బందులు హద్దుమీరుతున్నాయి. అయినా నిర్మాణ మంచితనం తనలో వుల్పావాన్ని, ప్రోత్సాహాన్ని యిచ్చాయి అన్నారు, నిర్మాత వెంకటరత్నం. హీరో కృష్ణతో తప్ప మరొకరితో చిత్ర నిర్మాణం తలపెట్టను అని మంటాపథంగా చెప్పారు.

# — సినిమా —



"బాబు"లో వాణిశ్రీ

### రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ !

ఇప్పటికి ఆరు చిత్రాలు యీ సంస్థ నుంచి వచ్చాయి. అన్నీ బాగానే ఆడాయి. మంచి చిత్రాలను నిర్మించే నిర్మాతగా తమ్మారెడ్డి కృష్ణమూర్తికి పేరున్నది.

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్ యొక్క ఏడ షూటింగు జనవరి రెండున ఆరంభం. ఈ కృష్ణంరాజు కథానాయకుడు. ముఖ్య ...ను ప్రభ, జయసుధ, అల్లు రామలింగయ్య ...ప్రభ పోషిస్తున్నారు.

కథను యద్దనపూడి సులోచనారాణి యిచ్చారు. మాటలను పినిశెట్టి రాశారు. ఈ చిత్రానికి వి. ఎస్. ఆర్. కృష్ణారావు ఛాయను, జి. వి. సుబ్బారావు కళను నిర్వహిస్తున్నారు. దర్శకుడు టి. ఎల్. బాబు.

ఈమధ్య దాశరథి వ్రాసిన పాట నొకదానిని, సంగీత దర్శకుడు చలపతిరావు రికార్డ్ చేశారు.

"పాప వున్న యింటికన్న స్వర్గ మున్నదా ?
పసిపాపకన్న చల్లనైన దైవమున్నదా ?"

అనెడి యీ పాటను సుశీల మధుర మనోహరంగా పాడింది.

రవీంద్రాలో కృష్ణంరాజు నటించడం యిదే ప్రథమం. ఇందులో ఆయన ధరించే వేషం బహా మంచిది.

### సుమకు మార్కులు !

విశాలాక్షి నిర్మించిన, జి. వి. ఆర్. శేషగిరి రావు దర్శకత్వం నెరపిన "ఆడదాని అదృష్టం" చిత్రం సుమ నట జీవిత జాతకాన్ని శోభాయ మానం చేస్తుంది అనెడి మాట పదుగురి నోట విన్నాను. ఈమెచేత నాయిక వేషాన్ని వేయించిన ఆచార్యను, వేయించిన జి. వి. ఆర్. ను, చెప్పి నట్టు చేసి మార్కులు సంపాయించిన సుమను అభినందించాలి.

స్త్రీలకు నచ్చే సంఘటనలు ఎన్నో వున్న "ఆడదాని అదృష్టం" చిత్రానికి రాజశ్రీ రచనను, హనుమంతరావు సంగీతాన్ని, వేణు ఛాయను నిర్వహించారు.

ఈ చిత్రంలో హీరో లిద్దరున్నారు. ఇద్దరికీ ప్రాముఖ్యం వున్నది. ఒక పాత్రను చలం, మరొక పాత్రను రామకృష్ణ పోషించారు. సహాయ భూమిక లను గిరిజ, నిక్కిలినేని, చిట్టిబాబు, విజయగౌరి, పద్మాంజలి మరియు నిర్మల ధరించారు. రెండవ నాయికగా మమత నటించింది. గ్లామర్ పాత్రలకు మమత కరెక్ట్ అని యీ చిత్రం నిరూపిస్తుంది.

ఆడవాళ్లను, "ఆడదాని అదృష్టం" ఆకట్టు కొంటుంది.

### కొత్త కవి రాసిన లోకం పాట

నవత చిత్ర వారి 'జమిందారుగారి అమ్మాయి' చిత్రంలో లోకం గూర్చి, మనుష్యుల గూర్చి కొత్త కవి రాసిన పాటను పాఠకులకు తెలుపుతాను. ఈ పాటను రామకృష్ణ గొప్పగా పాడాడు. జి. కె. వెంకటేష్ సంగీత దర్శకుడు.

"లోకపు చదరంగంలో
ఈ లోకపు చదరంగంలో
... పావులే
మౌరారో
...రే లేరులే...లేరులే" అనెడి జీవిత
...గిన ఈ కవి పేరు వి. లక్ష్మీపతి
... గారు

సంగీతం ...
...శ్రీ శారద, గుమ్మ...
వె... ...వు, బేబీ సరళ.
సందర్భ... ...ని ప్రశ్నించాను. ...
సృష్టి... పేద నివాసానికి వెళ్లే స...
సంగీత ...గానం యిచ్చారు."

ధ... ...సి చేసి, తన చేత ... లేకుండా చేసుకొన్న దాతగా గుమ్మ... ఆయన కుమార్తెగా శారద నటించింది. ఇతర పాత్రలను రంగనాథ్, రాజబాబు, గిరిబాబు, అల్లురామలింగయ్య, రావికొండలరావు, గిరిజారాణి, జయవిజయ, టి. జి. కమల పోషించారు. నిర్మాత : ఎన్. కృష్ణంరాజు.

### మూడూ కుదిరిన పాట

ఏ. వి. కె. ప్రొడక్షన్స్‌వారి "లక్ష్మణ రేఖ"కు గాను, సముద్రాల రాసిన పాటను, సంగీత సారథి సత్యం, గాయని జానకి చేత యిటీవల విజయా గార్డెన్ థియేటర్లో రికార్డు చేశారు.

పాట బాగుంటే, ట్యూను బాగుండక, ట్యూను బాగుంటే పాడడం బాగులేక ఎన్నో గీతాలు పాపులర్ కాలేకపోతున్నాయి. ఈ మధ్య నేను ఎన్నో పాటలను విన్నాను. మూడూ కుదిరిన సంఘటన "లక్ష్మణ రేఖ"కు ప్రాప్తించింది.

"వాడు లక్ష్మణరేఖ దాటిన ఫలితమే
నేడు నేను అనుభవించు నరకము" అనెడి

పల్లవితో ప్రారంభమయ్యే యీ పాటకు సముద్రాల కలం, సత్యం సంగీతం, జానకి గానం సమపాళ్లలో సహకరించడంవల్ల, పాట బలేగా వచ్చింది.



"దేవుడుచేసిన పెళ్లి"లో శారద

### "నవరస నాయిక"

"లక్ష్మణ రేఖ" చి...
హీరో... ...నటిస్తు...
గా... ...లించిం...
...ధన
...గా
...ర్ కళ.

పాత్రల... గుమ్మడి, చంద్రమోహన్, సుమ, అల్లు రామలింగయ్య, గిరిజ, ...న్నారు. కృష్ణాజిల్లాకు చెందిన ... కృష్ణారావు, చిత్తూరు ...త్రానికి నిర్మాతలు. డి... ... మరియు ఎగ్జిబిషన్ శాఖ ... అనుభవం గడించిన వెంకటరత్న... ...ర ధ్యంలో తయారయ్యే యీ చిత్రానికి ...ముగురి పెద్ద దర్శకుల వద్ద శిష్యరికం చేసిన ఎస్. గోపాల కృష్ణ దర్శకుడయ్యాడు.

— శ్రీనివాస్

"లక్ష్మణరేఖ" రికార్డింగ్ సందర్భంలో తీసిన చిత్రం, నిర్మాత ఏ. వి. కృష్ణారావు, జయసుధ ప్రభృతులున్నారు.



శ్యామల కళ్లల్లో నిప్పులు కురిపిస్తూ అన్నది. "నీ సహాయానికి చాలా కృతజ్ఞురాలిని. కాని చూడు చంద్రా! ఈనాటికీ నువ్వు నన్ను అర్థంచేసుకోలేక పోయేవంటే నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. నువ్వనుకున్నట్లు నేను జీవితంలో ఎన్నడూ నేను చేసిన పనులకు పశ్చాత్తాపపడను. పడబోను. ఇకముందు ఎప్పుడూ మాయింటికి రాకు. నా స్వంతవిషయాల్లో జోక్యం కలిగించుకోకు. తెలిసిందా?" అంటూ భళ్లున తలుపు వేసేసి యివతలకు వచ్చింది శ్యామల.

"ఏమంటున్నాడతను?" అనడిగేడు రవి.

"ఏమంటాడు? పట్టి కుళ్లబోతు వెధవ! తనని పెళ్లి చేసుకోలేదని ఏడుపు. మనిద్దరం కోరి చేసికుంటున్నామని యింకా ఏడుపు. మళ్లీ యీ యింటి గడప తొక్కవద్దని చెప్పేను." అన్నది శ్యామల.

"మంచిపని చేసేవు" అంటూ ఆ టాపిక్‌ని అంతటితో ఆపివేసేడు రవి.

4

రవీ శ్యామలల వివాహం యింకా నాలుగు రోజుల్లోనే ఉంది. తన వివాహం గురించి తోటి లెక్చెరర్లతో చెప్పింది శ్యామల.

"వరుడు ఏం చదువుకున్నాడు? ఉద్యోగం ఏమిటి?" ఇవే అందరూ మొట్టమొదట అడిగే

సమాధానం చెప్పటానికి ఎందుకో
...మలకు.
నా ... ...
...డిగే
...ంకుచిత...

ఏమిటి సం... ...య్యే కూడా కాదా?
...ద్యోగం చేస్తున్నవా
...దో పెద్ద జరగరాని

...చూస్తూ ... జీతంలో ...
... ...ర్తను ఎన్నుకున్నావెందుకు?" అంటూ ...ందరు ఆమెకు సన్నిహితులైన స్నేహితురాండ్రు అడిగేరు.

"ఆయన చదువు చూసి, జీతం చూసి, నేనాయన్ను పెళ్లి చేసుకోవటంలేదు ఆయన రచయిత. చక్కని రచనలు చేస్తారు" అంది శ్యామల.

"రచయితా! ఆయన పేరేమిటి? అనడిగేరు.

"రవి" అంది.

"రవా? ఆ పేరెప్పుడూ వినలేదే?" అన్నారు కొందరు.

"ఏదో ఒకటి రెండు కథలు వ్రాసినట్లున్నాడు. ఆయన పేరు పత్రికల్లో చూసినట్లే గుర్తు" అన్నారు కొందరు.

"ఆయన పేరు విన్నాంకాని ఆయన వ్రాసిన కథలేవిటో గుర్తులేదు" అన్నారు మరికొందరు.

వాళ్ల మాటలన్నీ మౌనంగా విని ఊరుకుంది శ్యామల.

లోపల మాత్రం "పట్టి కుళ్లబోతు మొహాలు. రచయితను చేసుకుంటున్నానని అసూ

సీరియల్

# అహం - అనురాగం

జి. పరిమళాసోమేశ్వర్

*(గత సంచిక తరువాయి)*

యతో పడి చస్తున్నారు." అనుకుంది.

ఐనా వాళ్లు తను రచయితను చేసుకున్నందుకు అసూయ పడేకన్నా, గుమాస్తా భార్య కాబోతున్నందుకే ఎక్కువగా వెక్కిరిస్తున్నట్లు ఆమె అంతరాత్మకి బాగా తెలుసు.

రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లి జరిగింది.

పెళ్లయిన తరువాత ఏర్పాటు చేయబడిన అల్పాహార విందుకు ఆమె స్నేహితురాళ్లు, అతని స్నేహితులు అందరూ వచ్చేరు.

రవికి తండ్రి లేడు. తల్లికి కొడుకిలా రిజిస్టర్ మ్యారేజ్ చేసుకోవటం యిష్టం లేకపోయినా యింటికి అతనే పెద్ద కొడుకు ... అతని సంపాదనమీదనే యింటిల్లపాదీ ... వల్లా పెళ్లికి అంగీకరించక తప్పలే... అతని యిద్దరు తమ్ముళ్లు, చెల్లె... ...

...పింది
రాలేదు కాని గ్రీటిం...

... శ్యామల స్నేహితురాళ్లు ...చుట్టూ ...రకాల ప్రశ్నలు వేసి అ... ఉక్కిరి ...సేరు. అతను ఎన్ని క... ...సింది, ... ఏం వ్రాస్తున్నదీ, ఇంగ్లీ... , తెలుగు ... ఆయన అభిమాన రచయితలు ఎవరైందీ ...గ్రా ప్రశ్నలు వేసి సమాధానాలు పొందేరు. అంతటితో ఊరుకోక "సినిమాల్లో ముద్దును ప్రవేశపెట్టడం గురించి మీ అభిప్రాయం ఏమిటి?" అని,

"సాహిత్యంలో శృంగారాన్ని ఎంతవరకు చిత్రించవచ్చు?" అని అడిగి అతనిని ఇబ్బందిలో పెట్టేరు.

వాళ్లంతా తన యెడల చూపుతున్న శ్రద్ధను, కుతూహలాన్ని గమనించిన రవి "ఫరవాలేదు. చదువుకున్న యువతరంలో రచయితలంటే ఆ మాత్రం అభిమానం ఉన్నదన్నమాట! అందునా తెలుగు దేశంలో రచయిత మీద ఆ మాత్రం గౌరవం ఉండటం విశేషమే!" అనుకుని తృప్తి చెందేడు.

శ్యామల మాత్రం "మొన్ననేమో అయ్యో గుమాస్తాను పెళ్లి చేసుకుంటున్నావా?" అని సానుభూతి చూపినవాళ్లే యివ్వాళ రచయితగా అతనిని గౌరవించటం చూసి నవ్వుకుంది.

"ఈ ఆడవాళ్ల స్వభావమే అంత! వ్యక్తిగా ఒక పురుషుడిని ఎంత గౌరవించినా భర్త అనేసరికి అతని హోదాను గురించి, అతని డబ్బును గురించే ఆలోచిస్తారు. భారత స్త్రీలకు ఎంత చదువుకున్న వారికైనా వ్యక్తిత్వం అనేది శూన్యం. "ఫలానా కలక్టరుగారి భార్య" అనీ "డాక్టరుగారి భార్య" అనీ అనిపించుకున్నప్పుడు పొందే ఆనందాన్ని, అహంకారాన్ని తమ హోదాను చూసుకునికూడా పొందరు" అనుకుంది.

వివాహం అవగానే శ్యామలను తమ యింటికి తీసుకువెళ్లేడు రవి.

ఒకటేన్నర గదిలో రవి తల్లి, యిద్దరు తమ్ముళ్లు, చెల్లెలుకాక నూతన దంపతులైన తాము ఎలావుండాలో అర్థంకాలేదు శ్యామలకు.

ఆ సమయంలో రవితో తమ యింటికి వెళ్లిపోదాం రమ్మని అడగటానికి ధైర్యం చాల్లేదు.

రాత్రి పదిగంటలు దాటి, అందరూ బయటి గదిలో నిద్రపోతే శ్యామలా, రవీ వంట యింట్లో నేలమీద చాప వేసుకుని పడుకునేవారు.

రవి యింతటి దారిద్ర్యంలో ఎలా వుంటున్నాడా అని విచారపడింది శ్యామల.

నెలకు మూడువందల రూపాయల జీతం వస్తుంది రవికి. ఆ డబ్బుతో ఐదుగురు మనుషులు అద్దెకొంపలో, హైదరాబాద్ నగరంలో బ్రతుకుతున్నారు!

పేదరికం ఎంత హేయమైనదో అక్కడ వున్న నెల రోజుల్లోనూ తెలిసివచ్చింది శ్యామలకు.

అక్కడున్నన్నాళ్లూ కూరలకి, పాలకి తనే డబ్బులిచ్చింది శ్యామల. అందువల్ల వాళ్లు ఎలాటి తిండి తింటారో చూసే అవకాశం కలగలేదు.

రవి తల్లి, తమ్ముళ్లు, చెల్లెలు ఆమెనొక దేవతలా చూడసాగేరు. ఆమె కట్టుకున్న చీరల ...ంక, నిగనిగలాడే ఆమె శరీరంవంక, అందమైన ...వంక, ఎత్తుగా ఫ్యాషన్ పెరేడ్‌లోని ...గా ఆమె అమర్చుకున్న తలకట్టువంకా ఆశ్చ... నోళ్లు తెరచుకుని చూసేవాళ్లు పిల్లలు.

తనవంక అలా చూస్తుంటే ఆమె మనసులో దేవినట్లుండేది. మాసిపోయిన చొక్కాలు దుస్తులలో, పేదరికంవల్ల సంక్రమించే అమాయకత్వాన్ని సౌమ్యతని ఒలకబోసే ఆ పిల్లల ముఖాలు చూస్తుంటే "రవి, యీ పిల్లలు ఒకే తల్లి రక్తం పంచుకుని పుట్టే"రన్న భావం ఆమె మనసులో మెదిలి ఆమెలో ఏదో తెలియని అశాంతిని రేపేది. ఒకసారి రవి చెల్లెలు లక్ష్మి "వదినా! నీ పాతచీర చిరిగిపోయిందొకటి యివ్వవూ? పరికిణీ కుట్టించుకుంటాను" అనడిగింది.

ఇంట్లో ఖర్చులను భరిస్తున్న కొత్త వదినను చూసి రవి తమ్ముళ్లు రఘు, రాముకూడా పెన్సిళ్లకు, పుస్తకాలకు డబ్బులడగడం ప్రారంభించేరు.

దేవురిస్తున్నట్లున్న వాళ్ల ముఖాలను చూసి లోలోపలే అసహ్యించుకుంది శ్యామల.

"దారిద్ర్యం మనిషిలోని ఆత్మగౌరవాన్నికూడా చంపివేస్తుంది కాబోలు" అనుకున్నది.

అన్నిటికన్న ముఖ్యంగా శ్యామలను బాధపెట్టిన విషయమేమంటే ఎంతో మధురంగా ఉద్రిక్తంగా గడపవలసిన తమ మొదటిరాత్రులు వంట యింట్లో అంట్లగిన్నెల మధ్య, పోపు డబ్బాలు, ఊరగాయ జాడీల మధ్య అన్ రొమాంటిక్‌గా, అతి సంసారపక్షంగా గడవటం!

"మధ్య తరగతి కుటుంబాలలోని స్త్రీలు

పెళ్లయి ఏడాది తిరగకుండానే శారీరకంగా, మానసికంగా వృద్ధులై యంత్రాల్లా, జీవితం మీద, ఏమాత్రం ఆసక్తి లేనట్లు కనపడతారు అందుకే కాబోలు! ముఖ్యంగా వైవాహిక జీవితంలోని తొలి దినాలు స్త్రీల మనసులలో చెరగని ముద్రలు వేస్తాయ్. ఆ సమయంలో పరిస్థితులు అనుకూలంగా ఉండి, భార్యా భర్త లిద్దరూ ఒకరిలో ఒకరు పూర్తిగా లీనమై ఒకరి నొకరు అర్థం చేసుకున్నారంటే ఆ అనుబంధమే ఎన్ని సంవత్సరాల పాటైనా చెక్కు చెదరక నిలుస్తుంది.

దీనికి పూర్తి వ్యతిరేకంగా పరిస్థితులుండి, జీవితంలోని చేదును మాత్రమే తొలి దినాల్లో చవి చూసినట్లయితే భార్యాభర్తలు మానసికంగా ఎన్నడూ దగ్గరకు రాలేరు.

కొన్నాళ్లు పోతే శారీరకానుబంధం కూడా అసహ్యకరంగా, బాధాకరంగా పరిణమించవచ్చు.

అందుకే పేదల యిళ్లల్లోను, మధ్య తరగతి యిళ్లల్లోనూ కొత్త పెళ్లి కూతుళ్లు ఎండ, వెలుతురు లేక బలహీనంగా, పాలిపోయిన మొక్కల్లా కనపడతారు.

అలా ఊహించుకుంటున్నకొద్దీ శ్యామలకు ఆ యింట్లో ఉండటం దుర్భర మనిపించింది.

దానికి తగ్గట్లు ఆమె కాపరం చూట్టానికని వాళ్ల యింటికి వచ్చిన స్నేహితురాళ్లు ఆ యింటిని, ఆ యింట్లోని మనుష్యులను, వస్తువులను చూసి ఎంతో ఆశ్చర్యాన్ని ప్రకటించేరు.

"ఇది యిల్లా? పావురాల గూడా?" అని ఒకామె అడిగితే, "అసలు యీ యింట్లో నువ్వు ఎలా ఉండగలుగుతున్నావు?" అని ప్రశ్నించే కొందరు.

"ఈ రకమైన సంసారం చెయ్యట... తాంతం బ్రహ్మచారిణిగా ఉండిపోవట... ఖం!" అన్నదొకామె.

"ఇలాటి కొంపలో ఉండవలసిన ఖర్మ నీకేం పట్టింది? లక్షణంగా మీ యిల్లు ఉందిగా. నువ్వు, మీ ఆయనా వేరు కాపరం పెట్టండి" ఒకామె సలహా యిచ్చింది.

"ఆయన యీమెతో వచ్చేస్తే వెంట ఆ సైన్యం కూడా వస్తారేమో!"

"శ్యామల అంత తెలివితక్కువదా? భర్తకా మాత్రం నచ్చచెప్పకోలేదా?"

వాళ్ల వ్యాఖ్యానాలు, సూచనలు, సలహాలు అన్నీ విన్నాక వాళ్లు చెప్పినదాంట్లో కొంత నిజం లేకపోలేదనిపించింది. ఒకరోజు రాత్రి నెమ్మదిగా భర్తతో యీ విషయాన్ని కదిలించింది శ్యామల.

"మనం యిక్కడ వుండలేమండీ. మా యింటికి వెళ్లిపోదాం" అంది.

"నేను నీవెంట వచ్చేస్తే మరి వీళ్లందరి గతి ఏమిటి?" అనడిగేడు రవి బాధగా.

"వాళ్లను మర్చిపొమ్మని, వదిలెయ్యమని నేను చెప్పటంలేదు వాళ్లకు కావలసింది డబ్బేగా. ఆ డబ్బును నెలనెలా మీ జీతంనుండి పంపండి. కావాలంటే మీ జీతమంతా వాళ్లకే యిచ్చేయండి. నా జీతంతో మనిద్దరం హాయిగా వుండవచ్చు. నేను చెప్పేదల్లా మనం ఈ యింట్లో కాకుండా వేరే యింట్లో నివసించాలని మాత్రమే! నామూలంగా మీ బంధాలన్నిటినీ తెంపుకోమని నేనేం చెప్పటం లేదు." అంటూ కొంచెం గట్టిగానే మాట్లాడింది శ్యామల.

రవి కొంతసేపు ఆలోచించి "సరే. నీ యిష్టం" అన్నాడు.

అతనలా సౌమ్యంగా జవాబివ్వటం చూసి తాను అనవసరంగా పరుషంగా మాట్లాడిందేమోనని నొచ్చుకుంది శ్యామల.

రవి తను, తన భార్య దగ్గర వుంటానని చెప్పగానే తల్లి బుగ్గలు నొక్కుకుంది. "అదేమిటిరా, చివరికి ఇల్లరికం పోవటానికిరా ఆ అమ్మాయిని పెళ్లి చేసుకున్నది?" అంటూ.

"అదికాదమ్మా. అందులో యిల్లరికం సంగతి ఎక్కడుంది? ఈ యిల్లు మనందరికీ సరిపోదు కనుక మేము వేరే వుంటాం. శ్యామల పెద్ద ఉద్యోగం చేస్తున్నది. ఆమెకోసం ఎన్నోరకాల మనుష్యులు వస్తుంటారు. అలాటివాళ్లను కూర్చోమన

*జరిగిన కథ 5 :* స్త్రీల కళాశాల
లెక్చరర్ శ్యామల. విద్యార్థినులతో నెహ్రూ
జూలాజికల్ పార్కుకు వెళ్లి వచ్చిన శ్యామల
అక్కడ తనను ప్రమాదం నుంచి కాపాడిన
అపరిచితుడిని మరిచిపోలేకపోతుంది. తనని
... చేసుకోవాలనుకుంటున్న చంద్రకి
... చుకోవటానికే అసహ్య పడు
... లు. తనను ప్రమాదం నుంచి
... బి. ఏ. తప్పిన పేద నిరుద్యో
... ప్రేమ
... నిరా...
... రోగ్యం చెడి మర
... రి శ్యామల. తనను ప్ర
కథ ... యిత రవి ఆమెను ప్రమ
కా... వ్యక్తే అని శ్యామల
కు... రవిని పెళ్లి చేసుకుంటే
తా... ధ పడవలసివస్తుందని శ్యామ
హెచ్చరిస్తాడు చంద్ర.

టానికి కూడా మన యింట్లో జాగా లేదు. అక్కడ ఆమె యిల్లు ఖాళీగానే వుంది. ఎవ్వరూ లేకుండా ఆ యింటిని పాడుబెట్టటం ఎందుకు?" అంటూ తల్లికి నచ్చచెప్పేడు రవి.

ఆమె పైకి ఏమీ అనలేదుకాని లోపల మాత్రం "అంత యిల్లు పాడవుతుందన్న బాధే అయితే అందరం ఆ యింట్లోనే వుండవచ్చుగా. ఈ యింటికి వేరే అద్దె ఖర్చుకూడా ఎందుకు? యిదంతా వేరింటి కాపరం పెట్టటానికి కోడలు చేసిన పన్నాగం. అంతకన్న ఏంలేదు" అనుకుంది.

రవికికూడా ఆ ఆలోచన రాకపోలేదు. కాని శ్యామల మాట్లాడనప్పుడు "మావాళ్లందరూ మీ యింట్లోనే వుంటారు" అని తనంత తానే చెప్పటానికి అతనికి అభిమానం అడ్డువచ్చింది.

మంచిరోజు చూసి శ్యామల, రవి ఆ ఇంట్లోకి వెళ్లిపోయేరు. ప్రతినెలా మొదటి తారీకున తన జీతంలో పాతికరూపాయిలు తన ఖర్చు కుంచుకుని మిగతా డబ్బును తల్లిచేతి కిస్తున్నాడు.

మొదట్లో ప్రతిరోజూ సాయంత్రం ఆఫీసు నుండి వచ్చేటప్పుడు యింటికి వెళ్లి అందరినీ చూసి వచ్చేవాడు. కొన్నాళ్లు పోయినతరువాత వారానికి రెండు మూడు రోజులు మాత్రమే వెళ్లేవాడు. ఇంకా కొన్నిరోజులు గడచిన తరువాత వీలుంటే ఆదివారం వెళ్లేవాడు. ఆదివారంనాడు శ్యామల ఏదైనా ప్రోగ్రాం వేసిందంటే ఆరోజుకూడా వెళ్లటం పడేదికాదు. చివరకు ఎవరైనా వచ్చి పిలిస్తేగాని వెళ్లనంతగా మారిపోయేడు రవి.

అతనిలోని మార్పును అతని యింట్లోవాళ్లు మాత్రం చాలా సహజంగా తీసుకున్నారు. "పోనీ నెల నెలా డబ్బిస్తున్నాడు. అంతే చాలు ఈ రోజుల్లో ఎందరు కొడుకులు ఆ మాత్రం చేస్తున్నారు?" అనుకుని తృప్తి పడింది తల్లి.

శ్యామల, రవి ఆనందంగానే కాలం గడుపుతున్నారు.

రవి శ్యామలను ప్రాణంకన్న మిన్నగా చూసుకుంటాడు. ఆమెను నొప్పించే మాట ఒక్కటన్నా అనడు. ఆమెకూ, తనకూ మధ్య అంతస్తులో ఏదో వ్యత్యాసం ఉన్నదన్న ఆలోచన అతని కెన్నడూ లేదు.

కాని శ్యామల ఆలోచనలు వేరు. రవిని వ్యక్తిగా, రచయితగా అభిమానించింది. ప్రేమించింది. అందువల్లనే అతనిని పెళ్లి చేసుకున్నది.

కాని రవి తన భర్త అయిన తరువాత కూడా కేవలం గుమాస్తాగా ఉండిపోవటానికి వీల్లేదు. అనుకుంది శ్యామల.

"... ింకా పై చదువు...
పె... ...ంలో ఉం...
...పాయి...
...యి
...మని
అం... ఒక రోజ...

"ఉదయం పది గంట్ల...ండి ...
...దు గంటల వరకు చచ్చీ చెడ్డా ...
యింటికి వచ్చేక హాయిగా...
...గా గడపక ఎందుకువచ్చి...
...ను రవి నవ్వుతూ.

"మీకు చదవటానికి ఉద్యో... ...డ్డమయితే కొన్నాళ్లు సెలవు పెట్ట..."

"సెలవు పెట్టటమా? జీత మిచ్చి ఏడాది పాటు లీవుమీద ఉండమని అడిగే ధర్మదాత ఎవ్వరు మన దేశంలో?"

"పోనీ రిజైన్ చెయ్యండి. బియ్యే, ఎమ్మే అన్నీ అయిన తరువాత మరో ఉద్యోగం చూసుకోవచ్చు."

"ఈ రోజుల్లో బియ్యే ప్యాసయిన వాళ్లందరూ ఉద్యోగాలు లేక ఓ పక్క చస్తుంటే నేను వున్న ఉద్యోగానికి రాజీనామా యివ్వాలా? శ్యామలా, నువ్వెంత అమాయకురాలివి! ఏదో ఆడపిల్లలకు జంతు శాస్త్రాన్ని బోధించటంతప్ప నీకు బొత్తిగా లోకజ్ఞానం లేదు. నేనీ రోజున ఉద్యోగానికి రాజీనామా యిచ్చేనంటే ఆ పోస్టుకోసం కొన్నివేల అప్లికేషన్లు వస్తాయ్. మూడేళ్ల తరువాత నేను ఎమ్మే డిగ్రీ పుచ్చుకున్నా యింతకంటె మంచి ఉద్యోగం సంగతటుంచి యీ ఉద్యోగంకూడా దొరుకుతుందో లేదోనని అనుమానమే!" అన్నాడు.

శ్యామలకి అతని మాటలు వింటుంటే కోపం వచ్చింది. బాధ కలిగింది. "సరే. మీకు ఆ గుమాస్తా ఉద్యోగమే మహావరంలా కనిపిస్తే దానినే పట్టుకుని వేళ్లాడండి. కాని నా యీ కోరికను మాత్రం చెల్లించండి. మీరు ఎలాగైనా ఎమ్మే ప్యాసయితీరవలసిందే !"

"మళ్లీ మొదటికే వస్తున్నావు."

"మొదలూ లేదు. చివరాలేదు. నా కోరిక తీరవలసిందే ! నా పట్టుదల సంగతి మీకు తెలుసుగా."

"ఆహా ! తెలుస్తూనే వుంది. వేరేచెప్పాలా ?"

శ్యామల వెంటనే ముఖం ముడుచుకుంది. "పొండి. నేనేం చెప్పినా మీ మంచికోసమేగా. మీరు పెద్ద చదువులు చదవాలని, మంచి హోదాలో వుండాలని కోరుకోవటం కూడా తప్పేనా ?" అంది కళ్లనీళ్లు పెట్టుకుంటూ.

"పిచ్చి శ్యామలా ! ఇంత చిన్న విషయానికి కూడా ఎందుకు కన్నీరు ? సరే. నీకోసం ఈరోజే బియ్యే పుస్తకాలు తెప్పించుకుని చదువుతాను." అన్నాడు.

"నిజంగానా ? మా రవి చాలా మంచి వాడమ్మా ! నేను చెప్పినట్లు వింటాడు." అంటూ అతని మెడచుట్టూ చేతులు వేసింది ప్రేమగా శ్యామల.

అప్పటికి శ్యామలకు మూడవనెల.

ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉంది ఆమెకు.

ఒక్కో సమయంలో సెలవు పెట్టి యింట్లో విశ్రాంతి తీసుకుందామా అనిపిస్తుంటుంది. కాని కాన్పప్పుడు ఎలాగూ రెండు నెలలు సెలవు పెట్టక తప్పదు కదా. ఇప్పటినుండీ పెట్టుకోవటానికి సెలవు లెక్కడ దొరుకుతాయిలెమ్మని సరిపెట్టుకుంటూ ఉంటుంది.

ఒక రోజు ఉదయం నిద్ర లేవగానే "హాపీ బర్త్ డే టూ యూ !" అంటూ చిన్నగా రవి నుదుటిమీద ముద్దు పెట్టుకుంది శ్యామల.

"అరె ! ఇవ్వాళ నా పుట్టిన రోజా ? నేనే మర్చిపోయేను" అన్నాడు రవి.

"ఔన్లెండి. మరపు అన్నది గొప్పవాళ్ల లక్షణంగా."

"ఆహాఁ అలాకాదు అనవలసింది. పేదవాళ్లకు పుట్టిన రోజు కూడా అన్ని రోజులలాటిదే. అందులో ప్రత్యేకత ఏమీ ఉండదు అనాలి."

"మీరు పేదవాళ్లా ? ఎవరామాట అన్నది ? ఇంత బంగారంలాటి మనసున్న మీరు పేదవాళ్లెందు కవుతారు ?" అంది అతని గుండెమీద తలానించి శ్యామల.

"నిజమే నీ బంగారు ప్రేమను పొందగల వ్యక్తి ఎన్నడూ పేదవాడు కాలేదు" అన్నాడు రవి.

"త్వరగా లేచి, ముఖం కడుక్కుని, స్నానం చేసి రండి" అన్నది శ్యామల.

"చిత్తం" అంటూ లేచి స్నానం ముగించుకుని వచ్చేడు రవి. "కాఫీ" అన్నాడు వస్తూనే.

"కాఫీ తాగేముందు యీ బట్టలు తొడుక్కోండి" అతని చేతికి ఒక ప్యాకెట్టు అందించింది.

ప్యాకెట్టు విప్పి చూసి "ఇంత ఖరీదైన బట్టలా ?" అన్నాడు.

"ముందు తొడుక్కుని చూడండి సరిపోయి నాయో లేవో. మీ షర్టు, పాంటు మీకు తెలియకుండా తీసుకుని ఆదికిచ్చి కుట్టించుకువచ్చేను. ఊఁ — చూడండి ఎలా ఉన్నాయో" అన్నది శ్యామల.



"నాకు తెలియకుండా యింత ఖరీదైన బట్టలు ఎందుకు కొన్నావు శ్యామలా ?"

"మీకు తెలిస్తే కొననివ్వరుగా. అందుకనే ముందు మీకు చెప్పలేదు."

"వీటి కోసం ఎంత డబ్బు ఖర్చు పెట్టావో ముందు చెప్పు."

"కుట్టుకూలితోసహా రెండు వందల రూపాయలయింది. సరేనా ?"

"రెండు వందల రూపాయలా ! నా జీతమెంతో తెలుసా ? నెలకు మూడు వందలు ! నా అంతస్తుకు తగిన బట్టలేనా యివి ?"

"అబ్బబ్బ ! ఎప్పుడూ మీకు అంతస్తు, తాహతు తప్ప మరో విషయం గుర్తు రాదు. ఆ మాటకి వస్తే నా తాహతుకూ రెండు వందలు కాస్త యెక్కువే! అంతమాత్రాన ముద్దు ముచ్చట్లు మానుకుంటానా? అంతస్తును గురించి మాట్లాడేటప్పుడు మీ ఒక్కరి జీతాన్నే దృష్టిలో ఉంచుకుని ఎందుకు మాట్లాడతారు ? మనిద్దరి ఆదాయం కలిపి మన అంతస్తును నిర్ణయించుకోండి. భార్యాభర్తలు సంపాదించే డబ్బును యిద్దరూ ఉమ్మడిగా అనుభవించాలిగాని, 'నీ డబ్బు నా డబ్బు' అని వేరు వేరుగా చూస్తే ఎలా? ఏనా రోజూ యిలాటి బట్టలు కొనవచ్చేమో ? మీ పుట్టిన రోజు — ఏడాది కొకరోజు వచ్చే పండుగ అని మనసుపడి కొన్నాను. ఏడాదిలో ఎన్నో పండుగలు వస్తయ్. కాని నాకు మీ పుట్టిన రోజుకంటే పవిత్రమైన పండుగ మరొకటి లేదు. అందుకే ఎంతగానో మనసు పడి కొన్నాను. మీ కసలు ఆ ధ్యాసే లేదు. ఎం సేపూ ఆ బట్టల ఖరీదును గురించి ఆలో గాని ఆ బట్ట లిచ్చిన మనిషి మనసును కోవటానికి ఎందుకు ప్రయత్నించరు ?"

ఆమె కళ్ల వెంబడి జలజల కన్నీరు ది.

రవి మనసు ఆమె కన్నీటిని చూస్తూనే కరిగి పోయింది. "క్షమించు శ్యామలా ! నిన్ను బాధ పెట్టాలని నా ఉద్దేశ్యం కాదు" అంటూ ఆమెను దగ్గరకు తీసుకుని ఆమె కళ్లనీళ్లు తుడిచేడు.

అతనిని ఆ ఖరీదైన దుస్తులలో చూసేక శ్యామల కళ్లు ఆనందంతో మెరిసినయ్.

"అదీ ! అలా ఉండాలి. అచ్చు ఆఫీసర్‌లాగా కనపడుతున్నావు రవీ !" అంది.

"కాని నేను గుమాస్తానేగా శ్యామలా !" అన్నాడు రవి నవ్వుతూ.

"ఇవ్వాళ గుమాస్తావే కావచ్చు. మరో నాలుగేళ్లు గడిచేక ఆఫీసర్‌వి కావని నమ్మక మేమిటి ?" అంది.

"అప్పటిదాకానన్ను గుమాస్తాగానే కనపడనీయ్, ఆఫీసర్ నయినప్పుడు సంగతి తరువాత చూద్దాంలే"

"అందుకే అంటున్నాను. తప్పకుండా ఎమ్మే ప్యాసవ్వాలి."

"ప్లీజ్ ! కనీసం పుట్టినరోజన్నా హాయిగా చీకూ చింతా లేకుండా ఉండనీయక ఆ పరీక్షం సంగతి యిప్పుడెందుకు గుర్తు చేస్తావు శ్యామలా ?" అన్నాడు రవి.

శ్యామల నవ్వింది "సరే. ఈ రోజు రాత్రికి మీరు పాఠాలేవీ చదవక్కర్లేదులే" అంది.

"అలా ! ప్రతిరోజూ యిలాగే పుట్టిన రోజులు వస ండును. చక్కగా పాఠాలు చదవటం డుకోవచ్చు" అన్నాడు రవి.

వి, శ్యామలా యిద్దరూ ఆఫీసుకు మల రెండు రకాల పిండి సిపెట్ట టు తి స్తకు వచ్చింది. " పైగా అయింది" అ శేష సమయంలో రవి తః ంటిని గురించి చించటం ఏమంత నచ్చలేదు శ్యామలకు. నిని సంతోష పెట్టాలనే ఉద్దేశ్యంతో "సాయంత్రం యిద్దరం యింటికి వెళ్లి వాళ్లను చూసి వద్దాంలెండి" అంది.

ఆ సాయంత్రం యిద్దరూ యింటికి వెళ్లేరు. వెళ్లేటప్పుడు తను చేసిన తినుబండారాలను తీసుకు వెళ్లి పిల్లలకు యిచ్చింది శ్యామల.

"ఇవ్వాళ నీ పుట్టిన రోజు కదురా రవీ ! పొద్దున నుండి నువ్వు వస్తావేమోనని ఎదురు చూస్తున్నాను. ఎంతకీ రాకపోతే యిప్పుడే నీ కోసం రఘుని పంపిద్దామనుకుంటున్నాను ! నీ కిష్టమైన సున్నుండలు చేసి ఉంచానురా" అంటూ పళ్లెంలో ఒక అరడజను సున్నుండలు తెచ్చిపెట్టింది తల్లి.

ఆ ప్లేటును శ్యామల వైపు పెట్టి "తిను" అన్నాడు రవి.

"అబ్బ ! సున్నుండలంటేనే నాకు పడదు" అన్నది శ్యామల.

రవి కడుపు నిండుగా ఉన్నా తల్లిని సంతోష పెట్టాలనే ఉద్దేశ్యంతో రెండు ఉండలు తిన్నాడు.

"ఇంక తినలేనమ్మా !" అంటూ పళ్లెన్ని తిరిగి తల్లి కిచ్చేడు.

"అన్నయ్యా ! పాంటూ షర్టు ఎంత బాగున్నాయో ! ఎంత ఖరీదయింది ?" అనడిగేడు రఘు.

"ఏ టైలరు కుట్టేడన్నయ్యా యింత అందంగా ? మన టైలరు వెంకన్నయితే పిచ్చి పిచ్చిగా కుడతాడన్నయ్యా. ఇకనుండి కూడా ఆ టైలరు దగ్గరే అనా ఘు.

ట్టలో రా

టలకు

తరువాత శ్యామల, సినిమా హైక్లాసు టిక్కట్లు కొని కూరు యి దగ్గర మాసిన బట్టల చె గుర్తుకు వచ్చేసరికి తః బట్టలు శరీరానికి ముళ్లు గుచ్చుకున్నయ్.

మర్నాడు రాత్రి నుండి రవికి ఠాలు చదవటం తప్పలేదు. శ్యామలను సంతృప్తి పరచటానికి ఫీజు కట్టి, పుస్తకాలు కొన్నాడేతప్ప రవికి నిజంగా పుస్తకాలమీద ఏమాత్రం శ్రద్ధే లేదు.

సహజంగానే రవికి చిన్నతనం నుండి క్లాసు పాఠాలమీద శ్రద్ధ తక్కువ.

ఏదో పరీక్షలముందు రెండు నెలలు కష్టపడి చదివి, ప్రతి సంవత్సరం బొటాబొటి ప్యాసు మార్కులు తెచ్చుకునేవాడు. మొదట్నుండీకూడా తీరిక వేళల్లో బొమ్మలు గీయటం, కథలు, నవలలు చదవటం, లేదా ఏమన్నా వ్రాయటం అతని కిష్టంగా ఉండేది. పరీక్షలన్నా, క్లాసు పుస్తకాలన్నా చచ్చే చిరాకు అతనికి. ఏదో చదువుకుని ఉద్యోగం చేసి, యింట్లోనివాళ్లను పోషించాలి కనుక ప్యాసు మార్కులకు సరిపడ పరిశ్రమ చేసి విజయాన్ని సాధించేవాడు.

[ఇంకా వుంది]



# డాక్టర్ సలహాలు

—డా. కె. వెంకటేశ్వరరావు

**ఎస్. జె– మిర్యాలగూడ.**

నా వయస్సు 28 సం. లు. గత సం. మూర్ఛ రాగా ఉస్మానియా హాస్పిటల్‌లో 'టి.బి' అని చేప్పారు ఇప్పుడు నాకు చెముడు వచ్చినది. చెవులలో ఒక విధమైన శబ్దము వచ్చుచున్నది. చెవులు తిరిగి వినిపిస్తాయా?

క్షయ అనే వ్యాధి ఉన్నవారికి, "స్ట్రెప్టోమైసిన్' 'ఐసోనెక్స్', 'పి ఎ ఎస్, థైయసిటజోన్' అనే మందులు వాడటం సహజం, 'స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్లు— వాడినందువల్ల కొందరికి, సరిగా వినబడక పోవటం, కొందరికి తల తిరగటం, ఒళ్ళు తూలటం జరుగుతుంది చెవులలో 'శబ్దం' (హెూరు) వుండటం కూడా దీనివల్లనే ఏర్పడుతుంది. పై లక్షణాలు ప్రథమంగా వచ్చినప్పుడే వైద్యులకు తెలియజేసి, వైద్యం క్రమంలో కొన్ని మార్పులు లేక ఇంజక్షన్లు మాని మాత్రలు వాడటం వల్ల తిరిగి ఈ లక్షణాలు రావు కాని, చాలా కాలం తర్వాత ఈ లక్షణాలు నిరంతరంగా ఉండే అవకాశం ఎక్కువ.

**పి. డి– చిత్తూరు.**

1952 వ సం. లో విరేచనాలు అయినవి. బాధ పడినాను. 1965 లో ...రులో పరీక్ష ... వగా, పిత్తాశయంలో రాళ్ళు (స్టోన్స్) ఉన్నవని ఆపరేషన్ చేశారు ఇప్పటికీ కుట్లు వేసిన చోట నెప్పిగా ఉన్నది. వంగి లేచినా, కష్టపడి పనిచేసినా కుట్లు వేసినచోట ఈడ్చి పట్టుకుంటున్నట్లు ఉన్నది

'ఆపరేషన్' చేసిన తర్వాత— కొన్ని కారణాల వల్ల కడుపు గోడల క్రింద ఉన్న భాగములు లేక వాటి పొరలు కడుపు గోడలలో కుట్లు వేసిన ప్రదేశం అడుగు భాగంలో అతుకు బడి నప్పుడు పైన మీరు తెలియజేసిన లక్షణాలు ఏర్పడే అవకాశం ఉంటుంది. కడుపులో—'ఒమెన్‌టమ్' మొదలగు భాగాలు, ఇలా అతుక్కొనే అవకాశం ఎక్కువ. మీరుతిరిగి ఆపరేషన్ చేసిన వారిని కలుసుకొనటం మంచిది.

**కె. వి– మదనపల్లి.**

మా స్నేహితురాలికి ఈ మధ్య కళ్లలో పసుపు పచ్చని 'స్పాట్స్' వచ్చినది అవి ఎందువల్ల వస్తాయి? వీటి వల్ల ప్రమాదమా?

కంటిలో— మచ్చలు ఏర్పడటం అనేది, చాలా కారణాల వల్ల జరుగుతుంది

వాతావరణంలో దుమ్ము ఎక్కువగా ఉండటం, కళ్లలో తరచు పుసులు కట్టడం, ఆహారంలో లోపించటం, కంటికి దెబ్బ... చిమ్మటం, దుమ్ము— ధూళి ఎక... కర్మాగారాలలో పని ...డం.

మీకి ... టి ఏర్పడే ... పలుఇలా ... రణాలు, ఈమచ్చ... ...చేసిన 'కాటుక'ల వల్ల కూ... వచ్చును.

సాధారణంగా వీటివల్ల ప్రమాదంలేదు ...ందరికి పెద్దవి అవటంవల్ల దృష్టిలో మార్పులు ఏర్పడ వచ్చును.



నీ గుండె చాలా బలహీనంగా ఉంది. ఎటువంటి గాభరా కల్గించే విషయములు వినకూడదు ...

ఈ విషయం మీరు రేపు బిల్లు ఇచ్చే టప్పుడు కాస్త గుర్తుంచుకోండి సార్!

**ఆర్– తుమ్మపాల.**

7 సం. ల వయస్సుగల అబ్బాయికి 'ప్రైమరీ కాంప్లెక్స్' అని నెలపాటు మందులు వాడిన తర్వాత వెన్ను పూస ఒకటి లావుగా తయారై, గూని లాగా ఏర్పడి నడవలేక బాధపడుతున్నాడు బాగుపడే అవకాశం ఉన్నదా?

'క్షయ' అనేది శరీరంలో ఏ భాగంలో నైనా ఏర్పడవచ్చును. వెన్ను పూసలో ఏర్పడినప్పుడు —'గిబ్బస్, అని అంటారు (వెన్ను పూస లావుగా ఉండటం) ఇలా వచ్చినవారికి ప్రత్యేకచికిత్స అవసరం విశ్రాంతి, వైద్యుల పర్యవేక్షణచాలా ముఖ్యం 'గూని— పోక పోయినా— మిగిలిన లక్షణాలు తగ్గి పోతాయి.

**సి. వి– నెల్లూరు.**

మా ఆవిడ వయస్సు 22 సం. లు ఆవిడకు 4 సం. క్రితం క్రింది పెదవి ఎర్రగా వుండేది. 4, 5 మాసములుగా తెల్లని మచ్చలు కన్పించు చున్నవి ల్యూకోడెర్మా/శ్వేతకుష్ఠు... లెప్రసీ అని అనుమానముగా వున్నది చిన్న పిల్లలు వున్నారు. కుటుంబములోని వారికి హాని

## డాక్టర్ సలహాలు

రాకుండా తీసుకొనవలసిన జాగ్రత్తలు తెల్పండి.

తెల్లని మచ్చలు శరీర భాగాలలో ఏర్పడగానే 'శ్వేతకుష్ఠు' అని అపోహ పడటం చాలా పొరపాటు. ల్యూకోడెర్మా అనే తెల్లని పొడల దగ్గరనుంచి, కేన్సర్ వరకూ—ఎన్నోకారణాలవల్ల ఈమచ్చలు ఏర్పడతాయి వంశపారంపర్యంగా రాగల మచ్చలుఅన్నిటికన్నా తరచూ వచ్చేవి

ఈ 'మచ్చలు' ●ప్రోసీ వల్ల వచ్చినవా లేదా అని వైద్యుల చేత పరీక్ష చేయించి నిర్ణయించు కోవాలి. అలా చేయక పూర్వమే— కుటుంబంలోని ఇతర సభ్యులను కంగారు పెట్టటం, మీరు బాధపడటం, మీ భార్య మనసు నొప్పించటం మంచిది కాదు.

ఎన్. ఆర్. విజయవాడ.

నా కంట్లో నలక పడి నీరు కారటం, మసక ఏర్పడినది. మందు తీసుకొన్నాను. నీరు కారటము తగ్గింది కాని మసక పోలేదు.

కంట్లో 'నలక' పడి— కొన్ని రోజులు నీరు కారి— తర్వాత మసక ఉండిపోవటం— కంటిలో ముందు భాగంలో ఉండే 'కార్నియా' అనే భాగంలో చిన్న పుండు ఏర్పడి— మానిన తర్వాత తెల్లనిమచ్చ ఏర్పడటం (చూపు కంటిలోనికి పోయే మార్గంలో) వలననే. ఈ మచ్చలను 'నెబులా'— 'ల్యూకో…
అని వైద్యులు వ్యవహరిస్తారు.
కొన్ని ఇతర… కంటికి కన…
కనబడనివి … ము ఉం…
మీకు … మం

బి. ఆర్ … స.

యు… …యా అంటే … జబ్బు. …
అయిన చికిత్స తెల్పండి?

"యూరేమియా" అంటే రక్తముల…
యా" పరిమాణం ఎక్కువ అ…
వైద్యులు తరచూ రక్త పరిశో…
రోగిని పరిశోధన చేస్తూ వైద్య…
ఉంటుంది.

సాధారణ స్థితిలో మనిషిలో 10 … రక్తమునకు 30 మి. గ్రా. యూరియా ఉంటుంది.

బి. వి. ఎస్. గూడూరు.

నాకు నెల రోజుల క్రితం రొమ్ము పైన తెల్లని మచ్చలు ఏర్పడినవి. వీనివల్ల ఆటంకములేమైనా వున్నాయా?

తెల్లని మచ్చలు ఏర్పడినందువల్ల— అనవసరంగా ఆందోళన చెందటం పరిపాటి అయిపోయింది.

అవి పెరుగుతున్నవా లేదా? అవి ఏదైనా అంటు రోగం వల్ల ఏర్పడినవా, వంశ పారంపర్యంగా వచ్చినవా అని గమనించడం ముఖ్యం.

ఏ కారణం తెలియనప్పుడు— అవి పెరగనప్పుడు అవి బయటికి అసహ్యంగా కనబడనప్పుడు— విచార పడటం అనవసరం.

'ఆటంకములు' అనేవి— వ్యక్తుల దృక్పధాన్ని బట్టి, రోగాన్ని బట్టి ఉంటుంది. ●

# ప్రశ్నోత్తరి

...కె. రామలక్ష్మి

**టి. ఆర్— మిర్యాలగూడ.**

లంచాలు మోసాలు రాజ్యం ఏలుతున్న యీ రోజుల్లో ప్రజలలో ఆందోళన ప్రారంభమై ఒక విప్లవం సృష్టించేలా వుంది.

ఎప్పుడు ? !

**బి. ఎమ్. ఆర్— హైద్రాబాద్.**

నాటకానికి జీవితానికి తేడాలేదు.

ఉంది. నిజ జీవిత నాటకానికి, నేపథ్య సంగీతం ఉండదు !

**కె. వి. ఆర్— విజయవాడ.**

...న్మాలా ?

...! ఎవరు చెప్పినా, ఎక్కడ ... అది నీ ... కరాత్మకి ...చి.

...బా

...మతూ పు... రు కదా ... దాని పుట్టుపూర్వోత్తరాలు చదవండి ...పుగారు రచన. దొరుకు చోటు . . . ...గా, ఇంకా తాపీవారి రచనలకి చిరు ... నువ్వే మళ్ళీ వోసారి చదవ ... స్త్రీని మనిషిగా గుర్తించమని కోరడానికి— పెళ్ళి పుట్టుపూర్వోత్తరాలకి సంబంధం దేనికి?! లేక అంత పాత కాలపు పద్ధతులను మీ విశాల హృదయులు రివైవ్ చేద్దామనా ? ! నా కర్థం కాలేదు !

**ఎస్. జి— భీమవరం.**

ఈ నాడు జీన్స్ వేసి జుట్టు పెంచిన మగవాళ్లను చూసి మీరేమంటారు?

చాలా ధైర్యం ఉండాలి చెల్లెలా— అలా తెగించి ఇష్టం వచ్చినట్లు వుండడానికి

**కె. ఆర్. కాజీపేట**

మంచితనాన్ని చేతకాని తనంగా భావించే వారిని ఏమనాలి ?

ఇగ్నోర్ దెమ్. అలాంటి వాళ్లను గురించిఆలోచించడం కూడా టైము వేస్టు.

**హెచ్. ఎస్. ఎస్. సికింద్రాబాదు**

ఆ చచ్చు ప్రశ్నలు పుచ్చు ప్రశ్నలు, కూపస్త మండూకాలు, అమ్మ ఎవరు ? అక్క ఎవరు ! ఆడ వాళ్లకు అసూయ ఎక్కువ. . ఇవేవీ ఎవరికీ దోహద కారి కావు. . .

చిత్తం. తమ దృష్టిలో ఏవి దేనికి దోహదకారు లవుతాయో కూడా చెప్తే పోయేది:. . చచ్చు పుచ్చు ప్రశ్నలు ఒదిలి పోనీ— బారుల గురించి, సినిమాల గుర్ధించి— మనం ఏం చెయ్యలేక పోతున్న విషమ పరిస్థితుల గురించి, ఆడాళ్ళు రాసేస్తు... అనే ఏడ్పు గురించి, దొరకని కాగితం గుర్... ...తున్న దొంగ సొమ్ము గురించి, ముమ్మర ... తున్న మహామంత్రుల ఉపన్యాసాల గురిం... ...వదు సారవంతం అ... ...?.

**వి. కె. ... ...పేట**

...మ అని పేరుతెచ్చుకో... ఏం చెయ్యాలి ?

వెనక చూడక డబ్బు ఖర్చు చేయాలి. అప్పుడు మీ భజనకూటం మీ బాకావూది పేరు చాటుతుంది.

**ఎమ్. జె. ఎఫ్. సి. ఓ.**

ప్రేమించి పెండ్లి చేసుకోవడం, పెళ్ళి చేసుకుని ప్రేమించడం ఎలా చేస్తే బాగుంటుంది ?

ఎలా చేసినా— పెళ్లాన్ని ప్రేమించడమే ప్రధానం సైనికా !

**ఎస్. ఎమ్. ఆర్. మంగళగిరి**

మనిషిలో మనసుకి, మట్టిలో మాణిక్యానికి గల తేడా ఏమిటి ?

మట్టిలో మాణిక్యాన్ని ఎప్పడైనా తవ్వి తీసే ఛాన్సుంది. మనిషిలోని మనసుకి వాడే దిక్కు. అంచేత వెలుగు చూసే ఛాన్సు తక్కువ!

**జి. ఎస్. కృష్ణసముద్రం**

. . మీ సమాధానాలు పాఠకుల సందేహాలు సమస్యలు తీర్చేటట్టు వుండాలి. ఏదో సరదాగా హేళనగా ఉండకూడదు. అది ఆలోచించండి.

. . ఈ ఉత్తరానికి జవాబివ్వరని నాకూ తెలుసు పాఠకులకు మీరంటే ఎంత అసహ్యమో నాకు తెలుసు.

అలాగా ? సుధాకర్, ఈ సంగతి యింత లేటుగా చెప్పావేం? పాఠకులకు నా పై 'అంత అసహ్యం' అని ఎలా అంచనా కట్టావో— తెలియదు కాని— అదే నిజమైతే ఎడిటరుగారు నన్నెప్పుడో యింటికి పంపించేవారే! స్వంత ఏడుపు లోకం మీద రుద్దకు బాబూ.

**ఎల్. వి. ఆర్— ఖమ్మం.**

కట్నం లేకుండా చేసుకుంటే చులకనగా చూస్తారు కట్నం తీసుకు చేసుకుంటే— ఈ సడింపుగా ...రు. చీచీ. మీ ఆడజాతికిదేంబుద్ధి.?

...కేంగాని, బ్రదర్, అసలు 'కట్నం' ... ఆలోచన బుర్రలో లేకుండా జీవిత భాగస్వామిని ఎన్నుకునే వూహ రాని తమలాంటి బుద్ధిమంతులను చూసి చూసి— మా బుద్ధులా మందగించిపోతున్నాయి! లేకపోతే ఏమిటి? కట్నం పుచ్చుకోకపోవడమే ఘనకార్యమా? కట్నం అడక్క పోవడమే— అభ్యుదయమా? ఇంక పెళ్లి అయిన దగ్గరనుండి 'నిన్ను కట్నం లేకుండా పెళ్లాడాను— నేనెంత గొప్పవాణ్నో తెలుసుకో' అంటూ పెళ్లాం ప్రాణాలు తోడే కంటే కానివో అర్థణావో ఆ కట్నం పుచ్చుకొని కుక్కినపేనల్లా వూరుకునే వాళ్లే నయమేమో అనిపిస్తుంది !!

**ఆర్. ఎల్— విశాఖపట్నం.**

స్వేచ్ఛకు వివాహం ఆనకట్ట అంటారు. నిజమా?

కాదు స్వేచ్ఛకు వివాహం కొత్త పరిధులు., కొత్త అంచులు, కొత్తచిగుళ్ళు యిస్తుంది. అది అర్థం చేసుకోక, వివాహం చేసుకుంటే స్వేచ్ఛ కొరవడుతుంది అనుకుంటారు కొందరు. వివాహం స్వైర విహారానికి ఆనకట్ట అని మగవారి భావన! అంతే.

**పి. సి. హెచ్ ఎస్ ఆర్- గోవిందపల్లి.**

ఈ కాలంలో మనిషి సుఖపడాలంటే ఏది ముఖ్యం !

డబ్బు! తృప్తి.






# మరోప్రపంచం

## పి. వి. ఆర్. శివకుమార్

ఉసూరు మంటూ కూలబడ్డాను హాల్లోని ఛైర్లో, ఇంట్లోకి అడుగు పెడ్తూనే. ఎండలో తిరిగి, తిరిగి వచ్చానేమో, మహా నీరసంగా వుంది. అక్కడే వున్న మరో వాలు కుర్చీలో కూర్చుని ఏదో అల్లుకుంటున్న వదిన నా రాకనీ, వాలకాన్నీ గమనిస్తూనేలేచి లోపలికి వెళ్లింది. ఫలితం నాకు తెల్సు. తృప్తిగా వెనక్కి వాలాను.

మరో రెండు నిముషాల్లో గాజు గ్లాసు నిండా చల్లనిషర్బత్ తీసుకు ప్రత్యక్షమయింది వదిన. గ్లాసందుకుని చల్లని ఆ పానీయాన్ని గట గట తాగేసి, గ్లాసు ఆమె చేతికందిస్తూ అన్నాను.

"థేంక్స్."

"థాంక్స్ సరేగానీ, వెళ్లిన యింటర్[illegible] ఏమయిందో చెప్పు" అంది వదిన.

"కనబట్టల్లా మొహమ్మీద? మళ్లా వేరే చెప్పాలా?" అన్నాను చిన్నగా నవ్వుతూ.

"అప్పుడే ఎలా తెలిసి పోయిందోయ్ రిజల్టు? నువ్వెళ్ళిందేమైనా ప్రైవేటు కంపెనీకా? పబ్లిక్ సెక్టర్ వాళ్లు ఫలితాలు అంత మొహమ్మీదే చెప్పరు. అంచేత వేదాంతం కొయ్యక, యింటర్వ్యూ ఎలా చేశావో చెప్పు" అంది తనూ నవ్వుతూ.

"నాట్ నెససరీ. నిజంగా రిజల్టే తెల్సి పోయింది. మనకా జాబు రాదోచ్!" నీరసంగా అన్నాను.

"నాకు రాకపోతే మానె. నీకు వస్తే అంతే చాలుగానీ, ఎలా తెల్సుకున్నావో పరమ సత్యం?"

"చెప్తా విను.

అసలా అడ్వర్టయిజుమెంట్ వేసిందేమో, ఇంజనియర్ ట్రయినీలు కావాలని. అనుభవమేమీ అడగలేదు. రెండేళ్లు శిక్షణా,ఆవెంటనే కన్ఫర్మేషనూ—అని వ్రాశారు.

తీరా యింటర్వ్యూకి వెళ్ళాక, యింజనియర్ ట్రయినీకాదు- గవర్నమెంట్ట్రెయినీగా చేరతావా ? అనడిగారు!"

"అదేమిటి ?"

"అదేలే, నిరుద్యోగ యింజనీర్ల ఉపాధి కల్పనా నిమిత్తం, కేంద్ర ప్రభుత్వం తల పెట్టిన ఓ పథకం. ఈ పథకం క్రింద నిరుద్యోగ పట్టభద్రులకీ, డిప్లమా హోల్డర్లకీ ఓ ఏడాది పాటు శిక్షణయిస్తుంది ప్రభుత్వం-వేర్వేరు ఫ్యాక్టరీల్లో."

"ఐతే ? అలా చేరితే కంపెనీకేం వుపయోగం? వాళ్లకి ఉద్యోగస్థులక్కర్లేదా ?"

" [illegible] నివే! బోల్డులాభం. ఈ ఏడాది పాట [illegible]మెంటుస్టైపెండ్‌యిస్తుంటే, క[illegible] పనుల్చేయించుకోవచ్చు. [illegible]చరిన [illegible] ఓ నెల్నాళ్ళపాటు [illegible] యిస్తారు. [illegible] పద[illegible] [illegible]లలూ అరవచాకిరీ [illegible] అన్నమాట !"

"ఫర్ నథింగేనిటి? నీకూ ఏడాది ఎక్స్పీరియన్స్ వస్తుంది. తర్వాత, వాళ్లే తీసుకోవచ్చేమో-పర్మనెంటుగా?"

వదిన అమాయకత్వానికి నాకు నవ్వొచ్చింది!

"అదీ అయింది తల్లీ ! ఓ కాండిడేట్ అడిగాడు అక్కడికీ-వన్‌యియర్ ట్రైనింగ్ కాగానే, ఉద్యోగం యిస్తారా? అని.

'ముందు గవర్నమెంట్ ట్రయినీగా చేరు. ఏడాది తరువాత, నీ పెర్ఫార్మెన్స్‌నీ, మా అవకాశాల్నీ, అవసరాల్నీ బట్టి ఆలోచిద్దాం...' అన్నారు !

ఏడాది తర్వాతనైనా మమ్మల్ని తీసుకునే ఖర్మ వాళ్లకేముంది? మళ్లీ మాలాటి ఫ్రెష్ కాండిడేట్లు అప్పుడూ దొరక్క పోరుగా?"

వదిన, పాపం తెల్లమొహం వేసింది.

"అన్యాయం కదూ?"

"ఏం చేస్తాం ? ఉద్యోగాలు దొరకని మా పరిస్థితిని ఎక్స్ప్లాయిట్ చేసి వాళ్లిలా వాడుకుంటున్నారు.

/ అలాగైనా చేరేవాణ్నే. కానీ, ఏణ్ణర్థం క్రితమే- పబ్లిక్ వర్క్స్‌లో ఆ ట్రయినింగ్ వెలగబెట్టేశాను నేను! అందుకే యిప్పుడు దానికీ పనికిరాను.

వీళ్లు అనుభవం అడగలేదు. అయినా అదో పెద్ద చెప్పుకోదగ్గ అనుభవమూ కాదు. అందుకే యీ అప్లికేషన్లో రాయలేదు నేను.

సరే, యింటర్వ్యూలో చెప్పాను మరి, వాళ్లు అలా ట్రైనీగా వస్తావా అంటే !

దాంతో పెద్ద ఫోజిచ్చేశాడు- ఆ ఆఫీసరెవడో !

'యీ విషయం ఎందుకు దాచాలని ప్రయత్నించావ్?' అంటాడు!" ,

"దాచటమేమిటీ, వాడి బొంద ?"

"వాళ్లిష్టం. యిచ్చేది వాళ్లు. ఏం మాట్లాడినా చెల్లుతుందిగా ! అయినా, ఆ ట్రయినింగ్‌తో కలిపితే, తర్వాత వాళ్లు చేర్చుకున్నా-మొత్తం మూడేళ్లు ట్రయినింగ్ అన్న మాట !

బి యస్సీ తరవాత నేను బి.యి కోసం చదివినన్నాళ్ళు ట్రయినింగన్న మాట్స మరి"

"మీ జాబుకి అంత ట్ర[illegible] మేమోనోంస్ !"

"గా[illegible] గుడ్డు ట్రయి[illegible] సఱ చాలామం[illegible] యి[illegible] ఫ్రెండ్స్ చెప్పారు ! [illegible] వెంట[illegible] రెండునెల్లో శిక్షణ యిస్తారుట[illegible] యిహ మిగిలిన కాలమంతా వర్క్[illegible] కోవటమే ! పేరుమాత్రం [illegible]

పోనీ—అలా కష్టపడి పూర్తిచేసినా, వాళ్ల కక్కు[illegible] మళ్లీ టెస్టులూ, యింటర్వ్యూలూ [illegible] తాత్సారం చేసి, చేసి, అప్పుడిస్తారుట— రెగ్యులర్ శాలరీ !

ఎలాగూ నాకిహ ఉద్యోగం యివ్వరుకదాని, యివాళ భలే డబాయించేసాన్లే. ఆ ఆపీసర్లు డంగైపోయారు, పాపం !"

"ఏం, ఏమన్నావేమిటి ?" నవ్వుతూ అడిగింది వదిన.

"రెండేళ్లు శిక్షణ అంటున్నారు కదా— ట్రైనింగ్ ఏ ఏ సెక్షన్లలో యిస్తారు ? ట్రైనింగ్ స్కీమ్‌వుందా ? ప్రోగ్రాంవుందా, టైంటేబిలేదీ ? అవన్నీ చూపిస్తే, ఆ డిపార్ట్‌మెంట్స్ నా అభిరుచులకి అనుగుణంగా, ఆశిక్షణ నా అభివృద్ధికి ఉపయోగ

కరంగా వుంటుందనిపిస్తే, అప్పుడు జవాబు లిస్తాను మీ యింటర్వ్యూకి – అన్నాను!

వాళ్లు నిప్పులు మీదపడ్డట్టు రవరవ లాడుతూ, 'అవన్నీ అడగటానికి వీల్లేదు. యిష్టమయితే జవాబులియ్, లేకపోతే వెళ్లిపో' మ్మన్నారు.

"కంపెనీ ట్రెయినీ పోస్టుకిపిల్చి, గవర్న మెంట్ ట్రయినీగా చేరమంటున్న మీరు, మాట నిలబెట్టుకుంటారనే నమ్మకం ఎలా? రెండేళ్లూ మీ పని చేయించుకుని, నిర్మాణాత్మక శిక్షణ ఏమీ యివ్వకపోతే మాగతి?" అన్నాను.

'ఏం చేయించు కుంటేనేం, మీ జీతం మీకు యిస్తాం కదా' అన్నారు.

'సార్! మేం బాధ్యతా యుతులమూ, దేశసౌభాగ్య నిర్మాతలమూ అయిన యింజనీర్లంగానీ, రోజుకూలీలాగ నెలకింత తీసుకు మీరు చెప్పిందేదో చేసి అవతలకి నడిచే కూలీలం కాము. మైండిట్' అన్నాను.

"ఇంత దురుసు వాళ్లు మా ఆర్గనైజేషన్‌కి పనికి రారు. నువ్వు వెళ్లచ్చు" అన్నారు.

అనెప్పి వచ్చేశాను.

...ది వదిన.

...టికి ఫ... ...యో

... , కల్మషాలూ, కృత్రి ...గొండి తనమూ,వ్యాపారసరళీ...

...ని మరో ప్రపంచాన్ని నిర్మించ ... ! మా యువతరం యింకా ఆ... ...స్సిన బానిస బ్రతుకులకి ప్రతి... ...ట్లేదు!

అ... ...ంది కాదు అసలైన విప్లవం. నేడో, రేపో రానున్నదే సిసలు విప్లవం.

ఆ నాడువచ్చిందికాదు నిజమైన స్వరాజ్యం. నేడో, రేపో మేం సాధించేదే అసలైన స్వేచ్ఛా రాజ్యం!

అందులో యీ అవినీతి, లంచగొండి తనమూఅట్టడుక్కిపోయి, సమతా, నిజాయితీ నింగిలో నిలబడుతాయి. మనకి గొడుగులై నిలుస్తాయి!

ఆకలి,నిరుద్యోగం మచ్చుక్కూడాకన్పించవ్!

అప్పుడే మాకందరికీ, మాకే కాదుదేశంలో చెయ్యగల ప్రతివారికీ పని దొరుకుతుంది– తిండీ దొరుకుతుంది!

సౌఖ్యమూ – శాంతి సర్వ జనావళికీ అందుబాటులో కొస్తాయి!" నవ్వుతూ అని, లోపలికి వెళ్లి, డ్రస్‌మార్చుకున్నాను. టేబిల్ మీది పత్రిక తీసి పేజీలు తిరగేస్తూ మంచం మీదికి చేరాను.

*   *   *

"ఇదిగో, నీ కేదో కవరు వచ్చిందయ్యా!" గదిలోకి వచ్చింది వదిన.

అందుకున్నాను. కవరుమీది ముద్రచూశాను. చింపాను.

"అదే వదినా! రెణ్నెల్ల క్రితం ఏదో సెంట్రల్ గవర్నమెంట్ ఎంటర్‌ప్రైజ్‌లో జూనియర్ యింజనియర్ ట్రెయినీలు కావాలంటే, అప్లై చేశానే, అదే!"

"ఇంటర్వ్యూనా? ఎప్పుడుట?"

"అదే చూస్తున్నా...అరె, యింటర్వ్యూ అనేం వ్రాయలేదే వీళ్లు!

ఊం...ఏమిటో, మీ అప్లికేషన్‌చూశాము. మిమ్మల్ని చూడదల్చుకున్నాము. ఇరవై అయిదో తారీకు ఉదయం పది గంటలకు మా ఆఫీసులో...

హాయ్...ఫస్ట్‌క్లాస్ ఫేర్స్! వెరీగుడ్"

"అవునూ, చూడటమేమిటయ్యా పెళ్లి చూపులల్లే? ఇంటర్వ్యూ కాదా?"

"దానికే మరో షోకైన పేరల్లే వుందిలే! ఏమైతేనేం, ఫేర్స్ యిస్తార్ట. వెళ్లొస్తాం; రిజల్టు మామూలే అయినా..."

"ఛ...ఛ... అపశకునం!"

"నో...నో... కీడెంచి మేలెంచమూ



## మరో ప్రపంచం

అన్నారు... అవునూ, ఇరవై అయిదింకెన్నాళ్ళు? కేవలం ఏడు రోజులే!

ఏమేం తీసుకెళ్ళాలబ్బా?'' మళ్ళా హుషారుగా పెరట్లోకి పరిగెత్తాను.

* * *

ఉన్నవి కేవలం పదికాళీలు. (విచిత్రమల్లా రిజర్వేషన్లు లేక పోవటమే!)

వందమందయినా వస్తారనుకున్నాను.

తీరా. రిక్షాదిగి ఆఫీస్ హాల్లోకి అడుగు పెట్టేసరికి మతిపోయింది !

అక్కడున్నది కేవలం ముప్పై దాటని సంఖ్య!

రిసెప్షనిస్టు, మర్యాదగా సోఫా చూపించి, కార్డు అడిగి తీసుకుంది. అయిదు నిముషాల్లో ప్యూనొచ్చి, సెగలు కక్కుతున్న నెస్‌కెఫే అందించాడు.

అంతకుముందు వచ్చినవాళ్ళ అంతకు ముందే త్రాగేసినట్లు ఖాళీ కప్పులు చెప్తున్నాయ్ !

కాఫీ పుచ్చుకున్నాను. కప్పు టీ పాయ్ మీద పెడ ండగా ఎవరో ఆఫీసర్ వచ్చారు హా

ర్పీ ఒకసారి పరి చి,

" అందరూ వచ్చి

గుడ్. థేంక్యూ జంటిల్మన్. మిమ్మల్నింకా విసిగించము.

ఒకరివెంట ఒకరుగా మా బోర్డాఫ్ డైరెక్టర్లని మీట్ కావచ్చు.'' అని లోపలికి వెళ్ళిపోయారు.

నాకు మతి పోతోంది యీ ఫార్మాలిటీలకీ, మర్యాదలకీ !

అటెండర్ వరుస నంబర్ల ప్రకారం పేర్లు పిలవసాగాడు.

నాది మూడో పేరే !

లోపలికి వెళ్ళాను.

అయిదుగురు ఆఫీసర్లు వున్నారు లోపల.

ఇంతకుముందు వచ్చినాయన నాకు కుర్చీ ఆఫర్ చేశారు. థేంక్స్ చెప్పి కూర్చున్నాను.

"సీ సర్ ! మేం మిమ్మల్ని యింటర్వ్యూ చేసి, కించపర్చాలని పిలవలేదు. అందుకే లెటర్స్‌లోనూ యింటర్వ్యూ అని రాయలేదు.

మీ సామర్థ్యమూ, తెలివితేటలూ, దేహ దార్ఢ్యాలని మీ కాండక్ట్ రికార్డ్స్, మార్క్స్ మెమోలూ, ఫిజికల్ రికార్డూ, ఫొటోగ్రాఫూ తెలిపాయి. అవన్నీ మాకు నచ్చబట్టే మిమ్మల్ని పిలవటం జరిగింది.

మేం యివ్వగలిగింది కేవలం పది పోస్ట్‌లే! వచ్చిన అప్లికేషన్లు వేలకి వేలు !

అందునుంచి, మార్కుల వరసలోనూ, మిగతా అర్హతలలోనూ, మాకు మొదటి స్థాయి వనిపించిన మొట్టమొదటి పదీ ఎన్నుకున్నాం. అయితే, ఒకేరకంగా అర్హతలున్న అప్లికేషన్లు కూడా ఒకటికన్న ఎక్కువ తగిలాయి. ఆ ప్రకారం యిరవైఏడుగుర్ని పిలవాల్సి వచ్చింది.

సో, మీలో మాకు నచ్చే పదిమందినీ ఎన్నుకోక తప్పదు. మీరు గనుక ఎన్నిక కాకపోతే శ్రమకు మన్నించండి.''

నాకు మతి పోయింది.

'ఇది ఇండియాయేనా ? ఇది ఉద్యోగం యివ్వటానికేనా ? ఇది యింటర్వ్యూయేనా?'

"నో సర్, యివి మా కలవాటే! నా అదృష్టాన్ని పరీక్షించుకోవాలనే వచ్చాను. మీరు నన్ను టెస్ట్ చేయొచ్చు.''

వినయంగా అన్నాను.

"ప్లీజ్—డోంట్ టాక్ లై

మీరు యిదివరలో

ర్వ్యూల తీరు వేరు.

విరుద్ధం.

మాది ఎక్స్‌పె

మేమిందులో విజయం పొందుతు

నికి నిదర్శనం మా కం

తీరూ, పొందుతున్న లాభాలే !

ప్రభుత్వం నడుపుతున్న వ

లోకే మాదే అధిక లాభాలు తీ ని!

ఇక, ప్రభుత్వం నడుపుతు నియే మాది! అదే ప్రభుత్వ యూనివర్సిటీ మీకు విద్య నేర్పింది! అదే ప్రభుత్వం మీకు పరీక్షలు పెట్టి మార్కులు యిచ్చింది. మొదటి తరగతి యింజనీర్లుగా నిర్ణయించింది !

ఆ ప్రభుత్వాన్ని మీరేదో మోసగించి డిగ్రీ పొందారని మేం తలచటంలేదు. మాకు మనుషుల మానవత్వంలో, నిజాయితీలో నమ్మకం వుంది.

అందుచేత, ఆ ప్రభుత్వానికి నచ్చిన మీ నడవడీ, అర్హతా, అదే ప్రభుత్వ వారసుల మయిన మాకు నచ్చకపోవటంలో అర్థంలేదు. కనుక మళ్ళీ మిమ్మల్ని టెస్ట్ చేసే ప్రసక్తే లేనేలేదు.

సో— మీలో పదిమందిని ఎన్నుకోవటమే

## రేపటి బొమ్మ

డా॥ సి. నారాయణరెడ్డి.

బొమ్మ గీస్తున్నాను
కాలం కాగితంమీద
కలల కుంచెతో.
అలలొస్తున్నాయి
అసహనం వేళ్లతో
తుడిచేస్తున్నాయి.

* * *

అలికినట్టు రంగులు
ప్రసవదశలోనే చిట్లిపోయిన
పసికందుల ప్రతిరూపాలు.

మళ్లీ బొమ్మగీస్తున్నాను
నీటి కాగితంమీద
నిప్పుల కుంచెతో.

చుర్—చుర్—చుర్—
చుక్కలు చిట్లిపోతున్నాయి
దిక్కులు పేలిపోతున్నాయి
శూన్యం కమిరిపోతున్నది.

చుర్. చుర్. చుర్—
అలలు ముంచుకొస్తున్నాయి
చుట్టుముట్టిన ఆవిరులమధ్య
ఊపిరాడక చస్తున్నాయి.

* * *

బొమ్మ పూర్తయింది.

* * *

నీటికాగితం నుదుట
తేలిపోతున్న అలల శవాలు.
నిప్పులకుంచె నోట
పుక్కిలిస్తున్న సూర్యోదయాలు.

తప్ప, మిగతా పదిహేడుగురినీ కించపర్చటం మా ధ్యేయం కానే కాదు.

మీకు యివ్వబోయే ఉద్యోగానికి ఎవరు ఎక్కువ అభిరుచీ, అభినివేశం కలిగివుండి, ఉత్సుకత చూపుతారో తెల్సుకోవటానికే యీ ప్రశ్నలు !

దయచేసి సూటిగా, నిర్మొగమాటంగా జవాబులివ్వండి"

ిడిలా చూస్తూండిపోయాను.

శ్నలకు జవాబులిచ్చాను,

ం నాలుగు గంటలకు

ుకోవచ్చు" అన్నారు

ంక్స్' చెప్పి వచ్చేశాను.

సాయంత్రం తిరిగి, వెళ్ళేసరికే బోర్డ్‌లో లిస్టు పెట్టారు. నేనూ సెలెక్ట యాన! ుండులో వున్న ప్రకారం పర్సనల్ మేనేజర్‌న ్పుకున్నాను.

రెడీగా వున్న 'అప్పాయింట్ మెంట్ ఆర్డర్' అందించారు.

'ఇది కలా ? యిలా ?' తెలీలేదు.

"చూడండి. మీ ట్రయినింగ్ పిరియడ్ ఆరు నెలల కాలం. కానీ, మీ పెర్ఫారమెన్స్‌నీ, చాకచక్యాన్నీ బట్టి హెచ్చింప బడనూవచ్చు. లేదా తగ్గించనూ వచ్చు.

తర్వాత మరో అయిదేళ్ల పాటు బాండ్ యివ్వాలి మీరు.

ఆ వివరాలన్నీ మీ కిచ్చిన ఆర్డర్ లో వున్నాయి. చదువుకుని, రేపుదయం సబ్మిట్ చేస్తారా?"

ఆనందాతిరేకంతో, అలాగేనని చెప్పి బయటకు వచ్చేశాం పది మందీ.

మర్నాడు అగ్రిమెంట్ సైన్‌చేసిచ్చేసి, మరోవారం లోగా వచ్చి చేరేలా మాట యిచ్చి, గాలిలో తేలూతూ రైలెక్కాను.

* * *

వదిన ఆశ్చర్యంతో నోరు తెరిచింది. అన్నయ్య ఆనందంతో భుజం తట్టాడు.

"మన దేశమూ మారుతోందిరా! తెలివి తేటలకీ, అర్హతలకీ అవకాశాలు లభించుతూనే వున్నాయి క్రమేపీ !"అన్నాడు.

నాలుగు రోజుల్లో అన్నీ సిద్ధం చేసుకు బయల్దేరి వెళ్లి ఉద్యోగంలో చేరిపోయాను.

* *

మూడు నెలలు గాలిగా గడిచి పో ాయి. పని కప ేనే ింది. ఔను మరి, ుిం దేమె అంతా పూర్తి థియరీ ! ప్రాక్టికల్ నాలెడ్జి ఎక్కణ్ణుంచొస్తుంది ? ఈ ఉద్యోగాల్లో ట్రయినింగ్ కన్నా, విద్యార్థి దశలోనే ప్రాక్టికల్ ట్రైనింగ్ కొంచెం ఎక్కువ చేస్తే బాగుణ్ణు !

నా వర్క్ సూపర్విజన్ కాబట్టి తేలిగ్గానే వున్నా, ప్రాక్టికల్ నాలెడ్జి కోసం అహోరహం వర్క్ షాప్స్‌లోనే గడుపుతూ, స్పెషల్ యిన్స్ట్రక్టర్స్‌తో వర్క్ నేర్చుకుంటున్నాను.

ఆ రోజు ఉదయం ఆఫీసుకి వస్తూనే, మేనేజర్ పిలుస్తున్నారని తెల్సింది !

ఇంతవరకూ ఎప్పుడూ ఆయన నన్నుపిలవ లేదు. 'ఎందుకబ్బా?' అనుకుంటూ వెళ్లాను.

"సె మిస్టర్ ! మీ పెర్ఫార్మెన్స్ యీ మూడు నెలలుగా గమనిస్తున్నాం, వర్క్ మీరు నేర్చుకుంటున్న తీరు, పని మీద మీకున్న ఆ శ్రద్ధాసక్తులూ, మాకుతృప్తినికలిగించాయి.

కానీ, మీరు పని చెయ్యవలసింది జూనియరింజనీర్‌గా గానీ, ఒక ఆపరేటర్‌గా కాదు. మీరు పని నేర్చుకోవటంతోపాటు పని చేయించటం ముఖ్యంగా నేర్చుకోవాలి.

ఆ సూపర్వైజరీ కెపాసిటీ మీలో లోపించింది.

పని చెయ్యటం క్షుణ్ణంగా తెలిస్తే, పని చేయించటం కొంత సులభమే అయినా, కమాండింగ్ పవర్, టాకిలింగ్ ప్రాసీజర్స్ కూడా చాలా అవసరం.

కాబట్టి యికనుంచైనా మీరు ఆ పద్ధతిలో కృషిచెయ్యవల్సిందిగా నా సలహా"

అంటూ లెక్చరిచ్చి పంపేశారు.

* * *

అప్పట్నుంచీ నా దృష్టి క్రమంగా సూపర్విజన్‌వైపు మళ్లించాను.

నెలర ు గడిచాయి. యీలోగా రెండు, మూడుసార్లు మేనేజర్ షాపులోకి వచ్చినప్పుడు నన్ను గమనిస్తుండటం నేనూ గుర్తించాను.

తిరిగి నన్నాయన పిలుస్తున్నారని తెలిసినప్పుడు వణికాను కొద్దిగా.

'ఏమిటీయన? పబ్లిక్ ఎంటర్‌ప్రైజ్‌లో గూడా ప్రయివేటుకంపెనీలా యింత కట్టుబాటా? మళ్ళీ ఏం లెక్చర్ వినాలో! "

బితుకుబితుకుమంటూ వెళ్లాను.

"కమాన్. బీ సీటెడ్ ! మీ మెరిట్ రేటింగ్, పెర్ఫార్మెన్స్, కాండక్ట్ రికార్డ్స్ మాకు నచ్చాయి— యీ నాలుగు నెలల్లోనూ. మీ ఛీఫ్ రికమండేషన్స్ కూడా బాగున్నాయి.

మిమ్మల్ని రేపు ఒకటవ తేదీ నుంచీ, కన్ఫర్మ్ చేస్తూ ఆర్డర్స్ యిస్తున్నాం. కంగ్రాచ్యులేషన్స్.

యిదేవిధమైన దీక్షతో ఆర్గనైజేషన్ అభివృద్ధికి తోడ్పడతారని ఆశిస్తున్నాం. కంగ్రాచ్యులేషన్స్"

నా బుర్ర నిజంగా తిరిగిపోయింది.

థాంక్స్, ఏదో అనేసి కలలోలా తేలుతూ

## ధర్మపథం
# అద్భుత శక్తుల వినియోగం
బులుసు వేంకట రమణయ్య

ఘోరమైన తపస్సు చేసినవారికి అద్భుతమైన శక్తులు కలుగుతాయి. అలాగే నిశ్చలమైన మనస్సుతో భగవంతుణ్ణి ధ్యానించే వారికి ఆయన అనుగ్రహంవల్ల అద్భుతమైన శక్తులు లభిస్తాయి. తలచిన కోరికలన్నీ నెరవేరుతాయి.



అయితే ఆ రీతి శక్తులు లభించాయి గదా అని వాటిని లౌకిక వ్యవహారాల కోసం, తమ కోరికలు నెరవేర్చుకోవడంకోసం ఉపయోగించుకోరాదు. అలా ఉపయోగిస్తే తనకే నష్టం. ఆ శక్తులు నశించాక ఆవ్యక్తి మామూలు మనిషికంటె హీనస్థితికివస్తాడు.

పూర్వం మహామునులు కోపంవచ్చి ఇతరులను శపించినప్పుడు వారి తపశ్శక్తి తగ్గిపోతూ ఉండేది. తిరిగి ఎంతో శ్రమపడి తపస్సు చేయవలసి వచ్చేది. ఈ విషయం మనకు పురాణాలవల్ల స్పష్టమవుతూ ఉన్నది.

భగవంతుడు కల్పవృక్షం వంటివాడు. కల్పవృక్షంక్రింద కూర్చున్నవాడు ఏమికోరినా అది ... నట్లు తపోధ్యానాలవల్ల మనస్సు పరిశ... కాగా, సాధకుడు జాగ్రత్తగా ఉండగలెను ... ని, లౌకిక ... ల... పడిపోకూడదు.

ఒక ధ్యానతత్పరుడు ఒక ఊరికిపోతూ ఎండదెబ్బతిని అలసిపోయి, దారిలో ఒకచెట్టు క్రింద కొంతసేపు విశ్రమించదలచి కూర్చున్నాడు. అక్కడ ఒక పాన్పుఉంటే హాయిగా పడుకోవచ్చునుగదా అని అతనికి తోచింది. ప్రక్కకు చూడగా ఒక పడక కానవచ్చింది. దానిపై విశ్రమించి, ఆకలిగా ఉండుటవల్ల 'ఏమైనా ఆహారం దొరికితే ఎంత బాగుండును ?' అని అనుకొనడమే తడవుగా రుచిగల ఆహారపదార్థాలు ప్రత్యక్షమయాయి. వాటిని ఆరగించి, అతడు తన అద్భుతశక్తికి తానే ఎంతో ఆనందించి, తనకు ఇక అసాధ్యమేమీ ఉండదని భావించాడు. కొంచెంసేపు గడిచాక అతనికి "ఇప్పుడొక పులివచ్చి నన్ను మింగివేస్తే ఏం చెయ్యగలను ?" అనే దురాలోచన కలిగింది. వెంటనే ... కాం డ్రుమంటూ ఒక పెద్ద ... మింగివేసింది.

అందువల్ల ధ్యాన... ధనం, గౌరవం మున్న... పొందవచ్చును. కాని వె...వానుకన... వంటి శోకం, రోగం, తాపం మున్న... కాచుకుని ఉన్న సంగతినికూడా బాగు... గుర్తించాలి.

---

బయటకు వచ్చేశాను. తోటి కొలీగ్స్ కంగ్రాట్స్ చెప్తున్నా నా మతి యిక్కడికి రాలేదు.

ఇతరఫాక్టరీల్లో పనిచేస్తున్న మా ఫ్రెండ్స్ చాలామంది మాటలు గుర్తుకురాసాగాయి : వాళ్లకి ట్రయినింగ్ పీరియడ్స్ ఎలా అకారణంగా ఎక్స్టెండ్ చేసినదీ, ఎలా ఆలస్యం చేసి ఏడిపించిందీ,...యిలాటివి !

అవన్నీ నిజమేనా ? మరి నా అదృష్టం మాట ? ?

ఇవేళ లేచినవేళ ఎంత మంచిది ! ఇంకా రెండు నెలలదాకా కనీసం ఆలోచించను గూడా వీలులేని, కన్ఫర్మేషన్ అప్పుడే జరిగిందా ?

## మరో ప్రపంచం

ఇది దేవుడి దయా, నా శక్తి ఫలమా. అధికారుల నిజాయితీనా-లేక అన్నీనా ?

ఏమయితేనేం, వెంటనే అన్నయ్యకి వుత్తరం వ్రాసిపడెయ్యాలి !

వదిన ఏమంటుందో ? ఎంత సంతోషిస్తుందో !

ఇదంతా నా అర్హతతో. మేనేజర్ మంచితనమో, కాదు. కేవలం తన ఏడుకొండలవాడిదయే నంటుందా ?

... చూడాలి.

గబుక్కున టేబిల్ మీద పెన్ అందుకున్నాను.

* * *

ధన్‌మంటూ కింద పడింది, నా చెయ్యి తగిలి, పేపర్ వెయిట్.

"ఏమిటయ్యా పాడునిద్దర పట్టపగలు గూడా ? పైగా ఆ కాళ్లూ, చేతులూ విసరటం కూడాను ! ఆ అలారంపీస్ కాస్తా క్రిందపడిపోతే ?

లేచి ముఖం కడుక్కో. కాఫీ త్రాగుదూ గాని !" వదిన మాటల్తో 'మరో ప్రపంచం' లోంచి 'మనదేశం' లోకి వచ్చిపడ్డాను — ఐ మీన్ నిరుద్యోగిగా నిరాశానిస్పృహల్లోకి!

ఆఫీసులో కూర్చుంది. ఏదో జ్ఞాపకం వచ్చింది. వెంటనే ఫోన్ రింగ్ చేసింది.

"లతను మాట్లాడుతున్నాను"

"నేను మనోరమని."

"నువ్వా తల్లీ. పెళ్లినుంచి ఎప్పుడు వచ్చావ్?"

". . . . నీ కోసం ఎదురు చూస్తున్నాను"

"అయితే అరగంటలో వస్తాను."

మనోరమ కాలక్షేపం కోసం వీక్లీ తిరగవేస్తోంది అరగంట గడిచి పోయింది. కాని లత రాలేదు. చిరాకుగా వాచీకేసి చూసింది· అది నెమ్మదిగా పరుగుపెడుతోంది. లత మీద అంతులేని కోపం ముంచుకు వచ్చింది. ఇదెప్పుడూ యింతే. అనుకున్న టైంకి రాదు.

కాని అంతలోనే ఆమెకా భావం తొలగి పోయింది. లత మీద సానుభూతి కల్గింది. పాపం తండ్రి పోగానే లత అదృష్టం తిరగబడింది. తనలాగే ఎం. బి. చదువుదామని ఎంత సంబరపడి పోయిందో. కాని పిన తండ్రి సాగనివ్వలేదు. పెళ్ళి సంబంధాలు వెతికాడు. లత తల్లి కూడ కూతురి పెళ్లి ముఖ్యమని తలపోసింది. లత అయిష్టంగానే ఒప్పుకుంది. కాని అది కూడ మూడు నాళ్ల ముచ్చటే అయింది. ఏణ్ణర్ధంకల్లా యాక్సిడెంటులో భర్త పోయాడు. వైవాహిక జీవితానికి సాక్షిగా బాబును మాత్రం లతకి మిగిల్చాడు భగవంతుడు. వాడిలోనే

## భవబంధాలు

(13 వ పేజీ తరువాయి)

తనని చూసుకుంటూ, కాలం గడవడానికి ఏదో మందుల షాపులో పని చేస్తోంది.

"ఏవిటి ఆలోచిస్తున్నావ్." లత వచ్చి ఎదురుగా కూర్చుంది.

"ఏం యింత లేటయింది ?"

"మా బాస్ కోసం వెయిట్ చెయ్యవల్సి వచ్చింది. అయినా నీకు తీరుబడి అయిందని నాకు కావద్దూ" లత లేచి ఫ్యాను స్విచ్చినొక్కింది.

"మంచి ఉద్యోగమే దొరికిందిలే!" అంటూ వరండాలోకి వచ్చింది. ఫ్యాను రంగయ్య కునికి పాట్లు పడుతున్నాడు. వాడ్ని కేకవేసింది.

"ఏం కావాలి నీకు?" లతని అడిగింది.

"వేడి వేడి యిడ్లీ, నెయ్యి కారప్పొడితో కావాలి."

నౌకర్ని హొటల్‌కి పంపించింది.

"మంగళ నువ్వు రాలేదని పదేపదే అడిగింది."

"ఏమన్నావు నువ్వు."

"ఆవిడ సంసార చక్రంలో పడిపోయింది తల్లీ ఇక మనం ఎవరూ గుర్తులేం. పూళ్లో వున్న నాకే దర్శనం దొరకదు అన్నా" హాస్య పూరితంగా చెప్పింది మనోరమ.

టిఫిన్ వచ్చేదాకా కులాసా కబుర్లతో గడిచి పోయింది యిద్దరికీ. ఇంతలో రంగయ్య వచ్చాడు. ఏ పొట్లం తీసుకోవాలో లతకి తెలియలేదు.

"పెద్దది నీది. చిన్నది నాది" మనోరమ తన పొట్లం తీసుకుంది.

"అదేమిటి స్వీటూ?"

మనోరమ తలూపింది.

లత టిఫిన్ చేస్తూ: "ఇడ్లీ చాల బాగుంది. అయ్యరుకి శుభమగుగాక. . . అయినా మనో నీకు ఐరన్ టిఫిన్ అంటే యిష్టముండదంటావు. అందుకే అలా నీర్సంగా కనిపిస్తున్నావు. తిండి ఎక్కువయితే ఫాట్ పెరుగుతుందని భయమా ఏమిటి ? అంది.

"అబ్బే. . ."

"అయినా రాకుమారివి కదా! కళ్యాణ వేదిక ముందు ఉంది. గ్లామర్ కాపాడుకోపోతే ఎలా?"

మనోరమని ఉడికించడం లతకి బాగా యిష్టం. బాధ్యత గల జీవితం గడుపుతున్న మనోరమలో యింకా పసి లక్షణాలు కొన్ని వున్నాయి. లత అటువంటి అవకాశాలని వినియోగించుకుని మనోరమని రెచ్చగొడుతుంది.

"ఇటువంటి పోకిరీ మాటల కోసం నిన్ను పిలవలేదు" ఉక్రోషంతొంగి చూసింది.

"మరి. . . నేను మాత్రం ఏ తప్పు మాట్లా

# సుఫల సాధించిన అధికోత్పత్తి, గ్రామాభివృద్ధి-
# దిగ్విజయమే !




**ఎఫ్. ... . మరియు వ్యవసా ముశాఖ**

వారి సహకారముతో "సుఫలగ్రామ" పథకముక్రింద ఈ విజయము సాధించబడినది. నెల్లూరు కొట్టాల గ్రామస్తులందరు అధిక దిగుబడి వంగడములతో సుఫల వాడి అధికోత్పత్తి, ఆర్థికాభివృద్ధి సాధించినారు.

మీరుకూడ సుఫల 15 : 15 : 15, మరియు యూరియావాడి అధికోత్పత్తిచేసి, ఆర్థికాభివృద్ధికి తోర్పడండి.

సుఫల 15 : 15 : 15 - నత్రజని, భాస్వరము మరియు పొటాష్ కలిగిన మిశ్రమ రసాయనిక ఎరువు.




**సుఫల 15:15:15**




**యూరియా**

**అన్ని పైర్లకు అమూల్యమైన ఎరువు - సుఫల 15 : 15 : 15**

మార్కెటింగ్ విభాగము



## ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లి.



(కేంద్రప్రభుత్వ యాజమాన్య సంస్థ)

ఆంధ్రప్రదేశ్ రీజనల్ ఆఫీస్

6-10-173, ఫతేమైదాన్‌రోడ్, హైదరాబాద్-500 004

kiron-FCI-2

డాను? అయినా బ్రహ్మచారిణి ముదిరినా, బెండకాయ ముదిరినా. . ."

మనోరమ లేచి ఆమె నోరునొక్కి "అమ్మమ్మలా మాట్లాడక." గదమాయించింది. నవ్వులవాన కురిసింది.

మరో పావుగంట గడిచినా లత మాట్లాడిందే ఎక్కువ. ఆమె వేళాకోళాలకి తట్టుకుంటూ మనోరమ కాలక్షేపం చేసింది.

"ఇప్పుడు చెప్పు." లత బుద్ధిగా అడిగింది.

"నీ కసి తీరిందన్న మాట."

లత వంగి ఆమె చేతిని ముద్దు పెట్టుకుని: "నీ బుంగమూతి చూడ్డం నాకెంతో యిష్టం అమ్మడూ. అందరికీ నువ్వు డాక్టరువయినా నాకు రమవే" అంది స్నేహితంగా.

బయట సాయంకాలం సెలవు తీసుకుంది. వెన్నెల రాత్రిలోకాన్ని ఆవరించింది. వెన్నెల వెలుగులో తెల్లటి మేఘాలు, గుంపులు గుంపులుగా నవ్వుతున్న నక్షత్రాలు, స్వచ్ఛంగా కనిపించే చందమామ, అలముకుంటున్న నిశ్శబ్దం. వాతావరణం పసందుగా వుంది.

"బయట కూర్చుందాం" లత కోరింది.

పోర్టికోలో రంగయ్య కుర్చీలు వేశాడు. కొబ్బరి చెట్లనీడలో నుంచి వెన్నెల విరిగి పడుతోంది. హాస్పిటల్ తగు మాత్రం నిశ్శబ్దంగా వుంది. పసిపిల్ల ఏడుపు, బావి దగ్గర గిలక చప్పుడు, దూరముగా ఎడ్లబండి చప్పుడు నిశ్శబ్దాన్ని చీలుస్తున్నాయి.

"చక్రవర్తి కనిపించాడు." మనోరమ చెప్పింది.

లతకి అర్థం కాలేదు. "ఎవరు?"

మనోరమ గుర్తు చేసింది.

"నీ హృదయ చోరుడన్న మాట."

"నువ్వలా ఈజీగా వాగేస్తే క్షమించేది లేదు." కటువుగా అన్నది.

"ప్రతీ చిన్న విషయానికి యిరిటేట్ అయిపోక"

"మరి నీలా సెన్సాఫ్ హ్యూమర్ నాకు లేదు."

లత యిక హాస్యం చెయ్యనని వాగ్దానం చేసింది. తర్వాత సంగతులు చెప్పమని కోరింది. పలువిధాల బ్రతిమాలింది. ఆమె చేత పావుగంట ప్రాధేయత పొంది, చివరికి మనోరమ నోరు విప్పింది ఎలాగయితే!

"ఏమన్నాడూ?" లతే చొరవగా అడిగింది.

"ఏముంది, జీవితంలో ఓడి పోయి సోషల్ పెర్వర్ట్ అయ్యాడు. నా మీద చాల ఎలర్జీవుంది. దీనికంతా కారణం నేనంటాడు."

"ఏడవలేక పోయాడు."

"అలా అనకు లతా. బాగా ఆలోచిస్తే అదే అనిపించింది. ఆ రోజు ప్రిన్సిపల్ దగ్గరికి పోకుండా వుండవల్సింది."

"పాస్ట్ ఈజ్ లాస్ట్."

"అవుననుకో. అయినా వెళ్లేదాకా నన్ను నిలవనివ్వానా?"

"బాగుంది. తప్పు నా మీద నెట్టుతున్నావా?"

"ఇద్దరి వల్లా జరిగింది. బంగారం లాంటి జీవితాన్ని నాశనం చేశాము."

# భవబంధాలు

"సెంటిమెంటల్‌గా ఆలోచించక. ఈ నాడు చక్రవర్తి చితికి పోయాడంటే దానికి కారణం అతడే. స్వయంకృతం అది. కాలేజీకి చదువుకుందుకు వచ్చాడా లేక అమ్మాయిలకి చీటీ రాయడానికి వచ్చాడా? ఆ రోజున నువ్వా నిర్ణయం తీసుకోకపోతే నీ మీద విజృంభించి వుండేవాడు. నీ బ్రతుకు నాశనమయ్యేది. యు ఆర్ డవ్ లకీ గరల్. దానికి సంతోషించు."

లత వాదన మనోరమ ఎంతమాత్రమూ సమర్థించలేక పోయింది. మనోరమ ఆమె అంతరాంతరాల్లో 'యిది తప్పు' అంటూ సుడిగుండాలు తిరుగుతోంది. చక్రవర్తి కనిపించినప్పటినుండి మనోరమలో రిపెంటెన్సు ఎక్కువయి పోయింది. చక్రవర్తి విడిచేప్రతి కన్నీటి బొట్టుకి కారణం తనే. తనవల్లే అతడు నష్టపోయాడు. ఈ రకం బాధ మనోరమకి ఎక్కువయి పోయింది. దాని యొక్క పీడనానికి ఆమె తట్టుకోలేక పోయింది. లతని పిలిపించి తన హృదయాన్ని ముందు పరచుకున్నది యిందులకే. కాని ఆమె దగ్గరనుంచి తను ఆశించిన సమాధానం రాలేదు.

"మరీ పూలిష్‌గా ఆలోచించకు మనో. నీది మెత్తటి హృదయం. కనుక పనికిరాని సంగతిని పదేపదే ఆలోచిస్తున్నావు. మరొకరయితే చక్రవర్తి పతనానికి నిండుగా సంతోషించేవారు. అయినా ప్రతీదానికీ యింతగా చలించి పోతే ఎలా?"

[illegible] మ మాట్లాడకుండా ఆలోచిస్తున్నది [illegible] తం [illegible] రిస్తున్నాడుట."

లత [illegible] ంది.

త [illegible] పింది మనోరమ.

"ఒక రకం పతనం అన్నిటినీ ఆహ్వానిస్తుంది. మంచో, చెడో జరిగిన దానితో సరిపెట్టుకుని జీవితాన్ని స్థిరం చేసుకోలేకగాడా? లేదు. తప్పుమీద తప్పు చేస్తూ ఖరాబు చేసుకున్నాడు. దానికిబాధ్యుడు అతడే." నిర్ధారణ చేసింది లత.

"జర్నీలో కనిపించి మెంటల్‌గా వర్రీ కలిగించాడు. నా వల్ల ఎవరయినా యిబ్బంది పడుతున్నారంటే నేను సహించలేను."

"అటు—ఇటు పోవాలి మనో. జీవహింస పాపమే. కరవడానికి వస్తున్న పాముపై కర్ర ఎత్తకపోతే ఎలా? చక్రవర్తి దౌర్జన్యం నుంచి నువ్వు ఎదిరించి తప్పుకున్నావు. ఆ పాపాన్ని అతడ్ని అనుభవించనియ్."

లత సాహసి. అందుకే వేగమైన నిర్ణయానికి రాగలిగింది. నిర్లక్ష్యంగా కొట్టిపారేయ్యగలిగింది సంఘటనలనుంచి తమని రక్షించుకుందుకు కొందరు తెగ తాపత్రయ పడి పోతారు. ఏదోలా నెపం అవతలికి విసిరేస్తారు. మానవత్వ విలువలతో ఆ సంఘటనని కొలిచినపుడు ఆ వ్యక్తి పూర్వకంగా న్యాయం కల్గించలేము. జరిగి పోయిన తప్పులో తన వాటా ప్రత్యక్షంగా ఏమీ లేదు. చక్రవర్తి మీద తాను ఆత్మరక్షణార్థం బుసకొట్టింది. తద్వారా తను రక్షణ పొంది ఎంతో ఉన్నత పథం పొందగల్గింది. ఆ మేరకు చక్రవర్తి పాము నోటిలో పడి పోయాడు. ఒకే పరిస్థితి తనకి నిచ్చెన, అతడికి పాముని యిచ్చింది.

ఇంటికి వెళుతున్నప్పుడు కారులో అందిలత. "ఫర్‌గెటిట్ మనో. . ఇదేం పెద్ద ప్రాబ్లం కాదు. నిత్యం వృత్తి ధర్మంగా ఎన్నో ట్రాజిడీలు చూస్తున్నావు. ఇలా బేలవయితే నీ వృత్తి కే అవమానం. బాగా ఆలోచించు."

లత యిల్లు వచ్చింది.

లత యింట్లోకి దారి తీస్తూ. . "లోపలికి రా... బాబుని చూసి చాల రోజులైనది కదా!" అంది.

"తర్వాత వస్తాలే. . చీర్స్" కారు ముందుకు పోయింది.

మనోరమ ఆ రాత్రి భోజనం కూడా సరిగ్గా చెయ్యలేదు. కనకమ్మకి తనకేం అవలేదని చెప్పడం బ్రహ్మాండమైనది.

ప్రతీ రాత్రి భోజన మవగానే కేశవయ్యతో కబుర్లు చెప్పడం అలవాటు. కబుర్లు ఆడుతూనే ముసలాయన నిద్రపోతాడు. ఆ రోజు మనోరమ భోజనమయిన వెంటనే మేడ ఎక్కేసింది. తాతయ్య విషయం మరిచి పోయింది.

రామయ్య వచ్చాడు. "తాతయ్య పిలుస్తున్నారమ్మా మనోరమ పక్క పొడి నములుతూ అప్పుడే కూర్చుంది బద్ధకంగా. తాతయ్య సంగతి జ్ఞాపకం వచ్చింది.

"ఏదో కేసు రిఫర్ చేస్తున్నానని చెప్పు రామయ్యా"

రామయ్య వచ్చి కుర్చీ దగ్గర [illegible]

"అదోలా వున్నావేమిటి అమ్మడూ." [illegible]

అంటూ చెయ్యి పట్టుకు చూ [illegible]

వచ్చు.

ఆ వాత్సల్యం అమెకిష్టవ [illegible]

కోరుకునేది ఏకాంతం "నాకేం కాలు [illegible] దుంగలా వున్నాను."

రామయ్య నొచ్చుకుంటూ, "ఛ. . ఛ. . అవేం మాటలు తల్లీ. ఈ ఆసుపత్రి పనిలో నీవు సగమయి పోయావు. "అభిమానం కురిపించాడు.

త్రిశంకు స్వర్గం ఏమిటో మనోరమకి అర్థం అయింది. ఇటు తను ఆశిస్తున్న ఒంటరితనమూ లభించడం లేదు. పోనీ రామయ్యని కసిరి పొమ్మనడం తనకి చేతకాదు. తాతయ్య కూడా. రామయ్యని ఏమీ అనడు. ఎంతో నమ్మకం కూడా. అంతటి వ్యక్తిపై చిరాకు ప్రదర్శించడం కష్టమే మరి. సందిగ్ధంగా కూర్చుని నిస్సహాయతని తిట్టుకుంది.

పావు గంటలో రామయ్య వెళ్లి పోయాడు

"అభిమానం ఎక్కువయినా కష్టమే" అనుకుంది.

(ఇంకా వుంది)

**చిన్నారి చిలిపిచేష్టలు**

ఈ శీర్షికను ప్రస్తుతానికి నిలిపి వేస్తున్నాము. మహిళామణులు గమనించ కోరుతున్నాము. —సం.



# దుర్వాసనే ఎడబాటుకు కారణం...

## కాల్గేట్ పరస్పర అన్యోన్యతకు కీలకం



COLGATE
DENTAL CREAM

DCG.50 TL

## కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి...రోజంతా దంతక్షయాన్ని నివారించండి!

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంత క్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటింపబడనట్లు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటే: కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. ఎంత చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు యిష్టపడతారు!

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...

**ఎక్కువ మంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్ కంటె కాల్గేట్‌నే కొంటారు!**

పూర్తి దంత రక్షణకు
**కాల్గేట్ టూత్ బ్రష్**
వాడండి
16 రకములలో - ప్రతివారికి అనువైనది లభించును.

# వారఫలం

—మహేష్—

## 10-1-1975 శుక్రవారం మొదలు
## 16-1-1975 గురువారం వరకు

**మేషం:—** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృషభం:—** చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. వృత్తిలో శ్రమ కలుగు తుంది. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**మిథు[illegible] :—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. నూతన వ్యవ[illegible] బాగుం[illegible]యి. [illegible]ం మధ్యలో ఆందోళన కలుగ[illegible] [illegible]హసిక [illegible]హారాల్లో నష[illegible] రాగలద[illegible]. [illegible]ారం ఆఖరులో అను[illegible]లత[illegible]. ప్రయాణాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**కర్కాటకం:—** మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగు తుంది.

**సింహం:—** వృత్తిలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది కోర్టు వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. దైవకార్యాలు నెరవేర తాయి. వారం ఆఖరులో భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సాటివారితో వాదప్రతి వాదాలు తగవు.

**కన్య :—** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది అనవసరమైన సందేహాలు కలుగుతాయి. స్త్రీలకు —పుణ్యకార్యాలు చేస్తారు. విలాసవస్తువులు కొంటారు.

**తుల :-** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృశ్చికం:—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా యెంతో కృషి చేయవలసివస్తుంది. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు —** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ఇతరులతోకలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సంతోష[illegible] కరమైన వార్తలను వింటారు. ఆరోగ్యం బాగుంటుంది. శుభకా[illegible] అనుకూలత లభిస్తుంది.

**మకరం :—** అనవసరమైన శ్ర[illegible] [illegible]ంతుం[illegible] సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. స్త్రీలకు —కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగు తుంది.

**కుంభం :—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో వ్యతిరేకమైన వార్తలను వింటారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. వారంఆఖరులో అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలు బాగుంటాయి. స్త్రీలకు —ఆరోగ్యం బాగుంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాల్లో చికాకులు యేర్పడతాయి. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. బంధువుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు.

# ప్రతి ఇంటా ప్రశ్న

## వెయిట్‌లిఫ్టింగ్ కోచ్ సుబ్బారావు

రాష్ట్ర ప్రభుత్వం శ్రీ ఎం. సుబ్బారావును వెయిట్ లిఫ్టింగ్‌కోచ్‌గా తూర్పుగోదావరి జిల్లాలో నియమించింది. ఆయన అభిమానులు, సహచరులు నేషనల్ యూనియన్సు అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ కె. రాఘవరావు అధ్యక్షతన డిశంబరు 15 వ సన్మానించారు. అందు కృష్ణాజిల్లా బాడీ బిల్డింగు అసోసియేషన్ అధ్యక్షులు శ్రీ ఎం. పిచ్చయ్య, విజయవాడ వెయిట్ లిఫ్టింగ్ అసోసియేషన్ కార్యదర్శి శ్రీ ఎం. కోటయ్య, నేషనల్ యూనియన్సు అసోసియేషను ప్రధాన కార్యదర్శి శ్రీ వెంకటేశ్వరరావు, స్నేహా యువకమండలి రామవరప్పాడు అధ్యక్షులు శ్రీ డి. కోటేశ్వరరావు, శ్రీ కోడిబోయిన పిచ్చయ్య, శ్రీ బొక్కా వెంకటస్వామి ప్రసంగిస్తూ గత రెండు సంవత్సరాలుగా శ్రీసుబ్బారావు విజయవాడ, పరిసర ప్రాంతాలలో ఉచితంగా వెయిట్‌లిఫ్టింగ్‌లో శిక్షణ యిచ్చినందుకు ఆయనను కొనియాడారు. అటువంటి వ్యక్తిని రాష్ట్ర ప్రభుత్వం గుర్తించి తగు నిర్ణయించేసి, ప్రభుత్వ సహకార వెయిట్‌లిఫ్టింగ్, బాడీబిల్డింగ్ ఉద్యమాన్ని వ్యాప్తంచేయ సంకల్పించినందుకు రాష్ట్ర క్రీడా మాత్యులు శ్రీ దేవానందరావును కూడా అభినందించారు.

* * *

శ్రీమతి ఉమాశశి రచించిన రెండు నవలలు 'శిశిరంలో వసంతం' 'ముగింపు మీకూ తెలుసు' అనేవాటిని సుదర్శన పబ్లికేషన్స్ అనంతపురంవారు ప్రచురించారు. వీటి వెల ఒక్కొక్కటి 6 రూపాయలు. మేలు ప్రతి 8 రూపాయలు. ప్రతులకు పైన పేర్కొన్న ప్రచురణ కర్తలకు వ్రాయొచ్చును.

## యుగపురుషుడు

రచన శ్రీ వేదవ్యాస, ఐ. ఎ. ఎస్., యుస్కోఫ్ ప్రచురణ. 140 పేజీలు. వెల పుస్తకంలో యివ్వలేదు. ప్రతులకు డా. భావరాజురామ చంద్రరావు, ఎం. బి., బి. ఎస్. ప్రెసిడెంట్, యు. ఎస్. సి. ఇ. ఎఫ్. ఐ. కేంద్రం, దానవాయిపేట, రాజమండ్రి.

## మధుర స్వప్నము

పద్యకావ్యం. రచన: శ్రీ వెనిగళ్ల పూర్ణచంద్రరావు 74 పేజీలు, వెల రు. 3.25. ప్రతులకు: శ్రీమతి వెనిగళ్ల ధనలక్ష్మి, కేరాఫ్ శ్రీ వెనిగళ్ల పూర్ణచంద్రరావు 6 వ వార్డు రేపల్లె. ●



# సైనిక్ స్కూలు-కోరుకొండ.

## 1975 సెషన్‌లో VI వ క్లాసులో ప్రవేశము

VI తరగతిలో ప్రవేశమునకు ...కము 1975 ఫిబ్రవరి 22 మరియు 23వ తేదీలలో ప్రవేశపరీక్షలు నిర్వహించబడును బాల... పరీక్షను తెలుగు, ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ లేక గుర్తింపబడిన ఏ యితర భాషలోనైనను వ్రాయవచ్చును. ఆంధ్రప్రదేశ్‌లో కోరుకొండ, ఏలూరు, గుంటూరు, ...తి, హైదరాబాద్, ...మాబాద్ కేంద్రములలో ఈ పరీక్షలు జరుగును. 1964 జూలై 2వ తేదికి తర్వాతను, 1965 జూలై 1తేదికి ముందుగాను జన్మించిన బాలురు మాత్రమేఅర్హులు. లోగడ 1974లో Vవ తరగతిలో ప్రవేశమునకు ప్రవేశ పరీక్షలకు హాజరైన బాలురుకూడా ఈ పరీక్షలకు హాజరగుటకు అర్హులగుదురు.

లభించు స్కాలర్‌షిప్పులు (ఎ) ఆంధ్రప్రాంతమునకు చెందిన బాలురకు రాష్ట్రప్రభుత్వము యొక్క ఉదార ఉపకారవేతనములు లభించును.

తల్లితండ్రులు వారి నెలసరి ఆదాయమునుబట్టి చెల్లించవలసిన సుమారు వార్షిక రుసుము:—

(1) రు. 0—300: రు. 25 (2) రు. 301—600: రు 350 (3) రు. 601—1000 రు. 1085 (4) రు. 1001—1600 : రు.1675 (5) మెరిట్‌స్కాలర్‌షిప్పులు (1) మొదటి ఐదుగురు బాలురకు వారితల్లిదండ్రుల ఆదాయముతో నిమిత్తం లేకుండగను (బి) రక్షణ దళమునకు చెందిన (మాజీ సైనికులతో సహా) వ్యక్తుల పిల్లలకు డిఫెన్స్ మరియు యు.టి. స్కాలర్‌షిప్పులు పరిమితసంఖ్యలోనూ, కేంద్రపాలిత ప్రాంతమైన యానాం నివాసులైన బాలురకు స్కాలర్‌షిప్‌లు లభించును. స్కాలర్‌షిప్పులు తీసుకొనే బాలురు ఎన్నికైనచో నేషనల్‌డిఫెన్స్ అకాడెమీలో చేరవలెను.

సీట్లసంఖ్య:—సుమారు 50 విద్యార్థుల కులములు తెగల బాలురకు, రెండుపేపర్లలో ఒక్కొక్కదానిలో 25శాతంకు తగ్గకుండాను, మిగతా రెండు పేపర్లలో ఒక్కొక్కదానిలో 32 శాతంకు తగ్గకుండాను సగటున అన్ని పేపర్లలో కలుపుకొని 32 శాతంకు తగ్గకుండాను మార్కులు పొందినయెడల మెరిట్‌లిస్టులో వారుపొందిన రాంకుతో నిమిత్తం లేకుండా ప్రవేశము కల్పించబడును.

ప్రాస్పెక్టసు మరియు దరఖాస్తు ఫారమునకు, నమూనా ప్రశ్నపత్రములకు రు 3—00 లను మనిఆర్డరు ద్వారా ప్రిన్సిపాల్ సైనిక్‌స్కూల్ (కోరుకొండ), ఎస్. ఒ., పిన్‌కోడ్ : 531214 వారికిపంపవలెను. అందులో నమూనా ప్రశ్న పత్రములు ఇంగ్లీషులో కావలెనా లేక తెలుగులో కావలెనా అనునది స్పష్టంగా తెలియచేయవలెను. ప్రవేశ పరీక్షా విధానము ముందు నోటీసు లేకుండగనే మార్పు చేయవచ్చును. పూర్తి చేసిన దరఖాస్తులు రు 5—00 లను క్రాస్‌చేసిన పోస్టల్ ఆర్డరును జతపర్చి (రిజిస్ట్రేషన్ ఫీజు నిమిత్తం) ఈ స్కూలుకు 25 జనవరి 1975 లోపు అంపవలెను.

# మీ జుట్టుకి చమురు చుక్క కన్నా ఎక్కువ మేలు కలిగించేది ఏదైనా వుందా

**ఉంది, ఒక చుక్క చమురు అదనంగా ఒక చుక్క పరిశుద్ధ సిల్వీక్రిన్!**



**ఎందుచేత?**



**చమురు చేసేదేమిటంటే**

సిల్వీక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్‌లోని ఎక్కువ తేలికైన చమురు యితర చముర్ల జిడ్డు లేకుండా మీ జుట్టుని చక్కగా దువ్వి సహజంగా కనిపించేట్టు చేస్తుంది

**పరిశుద్ధ సిల్వీక్రిన్ చేసేదేమిటంటే**

మీ జుట్టుని సమృద్ధిగా పెరిగేట్టు చేసే 17 అత్యవసర మాంసకృత్తి అనుబంధ పదార్థాలు పరిశుద్ధ సిల్వీక్రిన్‌లో వున్నాయి. పరిశుద్ధ సిల్వీక్రిన్ వెంట్రుకల మొదళ్లలోకి ప్రవేశించి, వాటిని బలవర్ధకం చేస్తుందని ఒక శాస్త్ర పరిశీలన బట్టి రుజువైంది.

సంపూర్ణ కేశ సంరక్షణకోసం కేవలం సిల్వీక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్‌లో మాత్రం పరిశుద్ధ సిల్వీక్రిన్ మరియు ... మేళవించబడి వున్నాయి. ... సౌభాగ్యంతో జుట్టు ... దువ్వినట్టు వుండాలంటే సిల్వీక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్ వాడండి.





mcm/bl/997

మీ జుట్టుని మీ అంత జాగ్రత్తతోనూ సంరక్షిస్తుంది.

# సిల్వీక్రిన్ హెయిర్ డ్రెస్సింగ్

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna





Phosfomin
Iron
480 ml
SQUIBB
min
IN TONIC
MULTIPLE GLYCEROPHOSPHATES B COMPLEX ELIXIR
SQUIBB
There's health in Phosfomin for all the family
Phosfomin
VITAMIN TONIC

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA




లక్ష్మి ఫిలింస్ రిలీజ్